ఓం

# ర మే శ బా బు.

## మొదటి ప్రకరణము.

### ప్ర యా ణ ము,

శుక్లపక్షపూర్ణిమయగుటచే వెన్నెల మనోహరముగా నుండెను. దినమంతయు సూర్యవేడిమిచే తహతహలాడిన ప్రజయంతయు ఆనందు వెన్నెలయందు హాయిగ నిదురించుచుండిరి. ముగ్గుపెట్టినట్లు వెల్లివిరిసి యున్ననక్షత్రసమూహముతోకూడి సుధాకరుడు గగనమండలమున దేదీప్యమానముగ వెల్గొందుచుండెను చల్లని పిల్లవాయువెల్లెడల వీచుచుండెను. నగరమింకను మాటుమణగలేదు.

సుమారు తొమ్మిదిగంటలవుతుంది. అట్టితటి శరీరమంతయు నొక శాలువచే కప్పుకొని తలపై చలినాపు ఉన్నిటోపీధరించి నొకవ్యక్తి రాజబాటంబడిపోవుచుండెను. అటులపోయిపోయి ఒకసౌధముముంగట నిలబడి 'రమేశబాబూ! రమేశబాబూ!' యని పిలచెను. అంత గృహము నుండి 'ఎవరువార'నుచు కవాటము తెరువబడుటయు యిరువురువ్యక్తులు లోనికిఁజనుటయు జరిగెను.

లండనునగరమున విఖ్యాతికెక్కిన వైద్యులలో రమేశబాబు ఒకడు. మాతృదేశమగు బంగాళమువీడి వైద్య, విజ్ఞానశాస్త్రముల ఉన్నతవిద్య బడయగోరి సీమకు బయలుదేరెను. స్వల్పకాలములోనే తనపరీక్షలయందుత్తీర్ణుడై అటనుండి వీడిరా బుద్ధిజనింపక లండనునగరముననే వైద్యవృత్తినారంభించెను. కాలక్రమమున రమేశుడు ప్రభుత్వమునందు సంఘ

మునందు మంచిపేరు సంపాదించుటేగాక క్రికెట్తోడు అమితముగ ధన మార్జించెను. తరుచుగ హత్యానేరములందు, శవపరీక్షలకై ప్రభుత్వము వారిచే నాహ్వానింపబడుచుండెను. అందున రక్షకశాఖాధికారులస్నేహ మున రమేశుడు అపరాధపరిశోధనావిధానమునగూడ నేర్పరి యయ్యెను. రమేశుడుసహజపౌడగరి, సుందరుడు, దయార్ద్రహృదయుడు, నిర్మలమైన స్వభావముకలవాడు.

రమేశునివలె స్వదేశమువీడి కడుంగడు ధనమార్జించిన వ్యక్తి బారిష్టరు మదన్‌లాల్. వీరిరువురు యించుమించుగ ఏకవయస్కులే. ఇరువురు ఒకచోటనే కళాశాలవిద్యముగించి సీమకరిగిరి. మదన్‌లాల్ మిత్రునివంటివాడుకాడు. సహజముగ కపటి, యీర్ష్యాపరుడు, కృత్రిమ స్వభావి. అయినను నిష్కపటివలె స్నేహపాత్రునివలె ప్రవర్తించు చుండును.

ఆనాటిరాత్రి సౌధమువద్ద కలుసుకొనిన యిరువురువ్యక్తులువీరే! మదన్‌లాల్ తమప్రయాణముగురించి ప్రసంగించవచ్చెను. మిత్రులిరువురు స్వగ్రామమగు చంద్రనగరమువీడి పదునైదేండ్లగుటచే స్వదేశముజూడ కోరికతో అటనుండి పయనమువ నుద్దేశించిరి. ఆవేళ ఆదివారము. నౌకా శ్రయమునందు కనుగొనిన సంగతులబట్టి మఱునాడు పదిగంటలకుగాని స్వదేశముబోవునౌక బయలుదేరదని తెలుసుకొనిరి. రాత్రి చాలవరకు వారలసామానులు సర్దుకొనుటతోడనే జరిగిపోయెను. రమేశునిగదియం దలి గడియారము పదకొండుగంటలు కొట్టుటచే యిక నిదురవచ్చుచున్న దని మదన్‌లాల్ తనబసజేరెను.

మఱునాడుదయముననే రమేశుడు తన కాలకృత్యముల నిర్వ ర్తించుకొని స్నానాంతరము కాఫీ, ఫలహారముల సేవించి మదన్‌లాల్ రాకకై నిరీక్షించుచుండెను. తొమ్మిదిగంటలయింది. మదన్‌లాల్ తన సామానుతో అరుదెంచెను. మిత్రులిరువురు ఓడరేవుకు ప్రయాణమైరి.

ఓడపై భాగమందొకగదియందు యిరువురు సుఖాసీనులైరి. కొలదిసేప టికే ఓడ నౌకాశ్రయమువీడెను. నౌక సాగరతరంగములుమధ్య నుయ్యే లవలె నిటునటునూగుచు బోవదొడంగెను. సముద్రముపై నుండి వీచెడి చల్లటిగాలికి రమేశుని మానస మెంతయు ఆనందభరితమై యొప్పుచుండెను. సముద్రయాన మెంతయు రమేశునకు హాయిగొల్పుచుండెను. కాని మిత్రుడు మదన్‌లాల్ రమేశునివలె సంతోషములేక ఏదియో ఆలోచనా పరుడై యున్నట్లు ఆతనిముఖలక్షణములబట్టి చెప్పనగును. ఆతనిమానస మున పలువిధములగు ఆలోచనలుపుట్టి పరువెత్తుచుండెను. "రమేశున కింతకీర్తియా! ప్రభుత్వమునందుగూడ యితనిపేరవిని కొనియాడుదురే! దీనికితోడు తనకంటె యెక్కువ ధనమార్జించెనని పల్కుదురు? నాతోటి వానికి యింతగౌరవముగల్గుటజూచి యిటు లూరకుండవలసినదే? కానిమ్ము! ఇతనిని గడదేర్చకబోయిన నాపేరు మదన్‌లాల్‌గాదు. స్వదే శముజేరిన తనకంటె బీదవాడున్న తస్థితిగాంచెనన్న అందరిలో నగుబాటు గాదా? అబ్బా! ఎంతధనము! ఈతనిధనముగూడ చేజిక్కినవో కావల సినదేది! బారిష్టరు మదన్‌లాల్ కోటీశ్వరుడన్న మాట. తొందరపడిన లాభమేమి? సమయముజూచి నాపనినెరవేర్చెద"నని మదన్‌లాల్ హృదయారాటమును యించుక శమింపజేసుకొని యెప్పటియట్లు మెలంగ జొచ్చెను.

ప్రభాకరుడు పశ్చిమసముద్రమున గ్రుంకెను. నల్లడల చీకటు లావరించెను, నౌకయందలి విద్యుద్దీపకాంతి తప్ప వేరొండు లేదు. వేళ యగుటచే మిత్రు లిరువురు తమ భోజనముల ముగించిరి. రమేశుడు మాత్రము కొలదిసేపు ఏదియో నవలను చదివి తదుపరి నిద్రాపరవశు డయ్యెను. అంతదనుక బయట కరిగిన మదన్‌లాల్ గది జేరెను. రమేశుడు నిదురించుట జూచి తన పనికి గడంగుట మంచి సమయమని తలంచెను. రమేశుని పెట్టెలను మెల్లగ తనవద్దనున్న తాళపుచెవులతో ప్రయత్నించి

ఒక్కొక్కటికి వెడలుచుండెను. ఎందుకు తన ప్రయత్నము ఫలించె కాబోలు ననుకొని ముఖమండలము వికసించెను. గది గవాక్షమునుండి సముద్రపు గాలి విరివిగ వీచుచుండెను. ఇంతలో గాలిచే నౌక పెట్టె మూత చప్పుడు చేయుచు పడెను. అప్పుడే నిద్ర పోవుచు రమేశు డది విని అదరిపడి లేచెను. కనులు విప్పి జూచి ఎదుట నీ దృశ్యము గాంచెను. తన ప్రయత్నము బయటపడినందున మిత్రుని ముఖము జూడజాలక తాను గుప్తపరచిన రివాల్వరు దీసి రమేశుని శిరముపై గురిజూచెను. అంత రమేశుడు తప్పించుకొనుటలో భుజముపై గాయపడెను. అయినను రమేశు డిక జాగు సేయక మదనునిపై బడెను. యిరువురకు బలమైన పోరాటము జరిగెను. యిరువురు గాయపడిరి. కాని రమేశునకు తగిలిన గాయము నుండి రుధిరము స్రవించ బాధ సహించలేక నీరసమున స్మృతివిహీనుడై నేల కొరిగెను. మూడు గంట లయ్యెను. చీకటు లింకను అంతరించలేదు. నౌక జిబ్రాల్టరు జేరెను. అదియె సమయమని మదన్‌లాల్ నౌక రేవు జేరుసరికి ఆ చీకటులందు అదృశ్యు డయ్యెను.

## రే ఖ.

బారిష్టరు మదన్‌లాల్ కలకత్తా జేరాడు. రమేశుని విషయమై పలువురు మిత్రులు, వాని బంధువు లడుగ కొన్ని దినములలో వచ్చు నని చెప్పెను. రమేశుని ధనమువలన ఆనందము పట్టజాలకుండెను. కాని ఆ వెనువెంటనే రమేశుని సంగతి జ్ఞప్తికి వచ్చుటతోడనే ఆందోళనా చిత్తుడై, రమేశు డెప్పటికైన తనపై బగ సాధించునేమో యను భయ మాతని మానసమున పీడించుచుండెను. రమేశు డా పోరాటమున విగత జీవు డయ్యెనో లేక మరల బ్రతుకునో, మదన్‌లాల్‌న కేమియు తోచుట లేదు.

రాత్రి సుమా రారుగంట లయినది. ఆకాశ మంతయు ముగ్గు పెట్టినట్లు నక్షత్ర సమూహముతో వెల్లివిరియుచుండెను. వాని నడుమ

శశాంకుడు తన చల్లని పండువెన్నెలచే ప్రజ నంతను ఆనందపరచు చుండెను.

మదన్‌లాల్ సౌధోపరిభాగమందలి యుద్యానవనమంతయు కడు రమ్యముగ నలంకరింపబడి జనసమూహముచే కిటకిటలాడుచుండెను. వనమంతయు మదన్‌లాల్ మిత్రులతోనిండి వారలుగావించు కుశల ప్రశ్నలు, హాస్యప్రసంగములతో సందడిగ నుండెను.

విందానంతరము మిత్రులందరు మదన్‌లాల్ వద్ద సెలవుగైకొని ఎవరియిండ్లకు వారేగిరి. అట్టితఱి మదన్‌లాల్ పేరుగాంచిన ఇనస్పెక్టరు రాఘవన్‌తో ప్రసంగించుచుండెను. మదన్‌లాల్ రమేశునిపై కల్పిత నేరములజెప్పి ఇనస్పెక్టరు రాఘవన్‌ను తనకు సహాయపడవలసినదని కోరెను. మదన్‌లాల్ నిజస్వభావము గాని, అసలాతడు చెప్పినపల్కుల సత్యాసత్యములుగాని యెఱుంగని రాఘవన్ తాను తప్పక సహాయ పడుదుననిచెప్పెను. ఇటులా యిరువురువ్యక్తులు సంభాషించునపుడొక ముదుసలి పొంచియుండి యంతయు వినుచుండెను. సంభాషణానంతరము మదన్‌లాల్ ఆవ్యక్తిని తమసామీప్యమునుండి పోజూచెను గాని ఎవరో ముదుసలియని వూరకుండెను.

మఱునాడు మదన్‌లాల్ రాఘవన్ లిరువురు తొమ్మిదిగంటలకు కలుసుకొనిరి. అటుపై వారిరువురకీవిధముగ సంభాషణజరిగెను.

'మదన్‌లాల్! నిన్నటినుండి చాలప్రయత్నించితిని. పోష్టుసందు గూడ కనుగొంటిని. రమేశుడను పేరువాడెవడు దిగలేదని చెప్పినారు. బహుశః ఆతడు యిచ్చటకు రా భీతిజెందియుండును!'

మ—రాఘవన్ బాబూ! అటులనా? అయినను మనము జాగ రూకులమై యుండవలయును. అతడు కడు మాయావి. ఛద్మవేషి.

రా—వయస్సు ఎంత?

మ—సుమారు ముప్పది. ఎఱ్ఱనిచాయగలశరీరము. స్ఫురద్రూపి. పంకోలుదిరిగినజుట్టు. సుమారారడుగులుండును. కణతపై కాలినమచ్చ గలదు. అవియే యితనినానావ్యక్తిని గుర్తింపజేయును.

రా—అయిన యిక నాశక్తికొలది తప్పక ప్రయత్నించెద! భయపడకుము.

ఇంతలో తపాలాజవాను ఒకవుత్తరమునిచ్చిపోయెను. అది మదన్‌లాల్‌న కుద్దేశింపబడి వ్రాయబడెను. అందిట్లుండెను.

'మిత్రద్రోహి! మదన్‌లాల్!

నేను మృతిజెందితినని యెంచి నిశ్చింతతో నాధనముతో కులుకుచుంటివా? కపటధైర్యశాలివి! నీకుతోడు నిరూపకుడా! అయినను తెలియలేదా? యిటకు తిరిగివచ్చుటలో నేనెన్ని యిడుములకులోనై యుంటినో గ్రహింప నలవికాదుగదా! నీచుడా! నీపాపకృత్యమునకు ఫలమనుభవింపకబోవు. వేచియుండుము. కష్టమునుండియే నీప్రాణములపై ఆశవీడుము. ఆనాడు రాఘవన్‌తో మాట్లాడుచుండ నే వినలేదా! ఆముసలి ఎవరు? జాగ్రత్త? మదన్‌లాల్! జాగ్రత్త!

ఇట్లు
రమేశ్'

మదన్‌లాల్ లేఖచూచి కొయ్యబారెను. అంతదనుక బొమ్మవలె నిశ్చేష్టుడై వినుచున్న రాఘవన్ మదన్‌లాల్ జబువుట ఆగుటతోడనే మరల తెలివిగాంచి తన పరిసరముల నొకపరి వీక్షించెను. మదన్‌లాల్ మేన ప్రాణములులేవు.

"ఇనస్పెక్టరుబాబూ! చూచితిరా! నే ననుకొన్నంతయు జరిగినది. నే తొలుతనే జెప్పితిగా! ఆతడు కడు మాయావి"

"లాల్! యీ లేఖనుబట్టి జూడ యీతడీ విషయములందు మంచి ఆరితేరిన వానివలె వున్నాడే! కానిమ్ము! భయపడనవసరము

లేదు. నే నిప్పుడే నీ శత్రువుని జాడలరయ యేగుచున్నాడ" ననుచు రాఘవక్ అటనుండి వెడలెను.

## హ త్య.

సూర్యుడు పశ్చిమాద్రిని గ్రుంకుచుండెను. అస్తమించెడి ప్రభాకరుని అరుణకాంతులు పరిసరచెట్లు చేమలపై బడి వాటికొకవిధమగు నూతనశోభ దెచ్చుచుండెను. మందమారుతము హాయిగ వీచుతోంది. చీకటి పడుచుండుటచే పశుపక్ష్యాదులన్నియు తమతమ నెలవుల జేరుచుండెను. అట్టితఱి హుగ్లీనదీతీరము వెంబడి ఒకవ్యక్తి మెల్లగ వచ్చుచుండెను.

రాఘవక్ మదన్‌లాల్ లిరువురు కార్యార్థమై యెచ్చటికోబోయిరి. అటులావ్యక్తి నగరము ప్రవేశించి మదనుని గృహమువైపు తన నడక సాగించెను. గృహకవాటము లీవల బంధింపబడియున్నాయి. అంత ఆ వ్యక్తి తన జేబునందలి సీసాదీసి యందలి ద్రవమును కొలదిగ నా బీగమున పోయ నది విడివచ్చెను. అటుల యిలుజొచ్చి గృహమంతయు నలువైపుల కలయజూచెను. తానున్నది ఒక హాలు. అందు మధ్యగ గుండ్రని బల్లయు, చుట్టును కుర్చీలు అమర్చబడి యుండెను. అటనుండి గదులనన్నిటి జాగ్రత్తతో వెదకదొడగెను. ఎందును మదన్‌లాల్ మందసము కానరాలేదు. తుదకు విసుగుజెంది వచ్చుచుండ నొకగదివెలుపల బంధింపబడి యుండుటగాంచి అందె దప్పకాతడు దాచియుంచునని తలచి తన తాళపుగుత్తె దీసి నందొక్కొక్క దానిచే ప్రయత్నింప మొదలిడెను. రామచంద్ మందసము తెరచి నందుండెడి వస్తువునేదో ముట్టబోవుచుండ యెటనుండియో పిస్టలు 'ఢాం' అను శబ్దముప్పుటయు రామచంద్ 'అబ్బా' అనుచు అచేతనుడై అటులే పడుటయు జరిగెను.

## స ం ఘ ట న.

కార్యార్థియై వెడలిన రామచంద్ యింకను రానందులకు రమేశుడు, ఆతనిపరివారమంతయు ఆతురతపడుచుండిరి. ఎంతకు ఆతనిజాడ లేదు. అంత రమేశబాబు రామచంద్‌నకు ఏమిహానిజరిగెనోయని తలచి తానేస్వయముగ బయలుదేరెను.

అటుల రామచంద్‌ను హత్యగావించిన మదన్‌లాల్ యితరులకు గాని రాఘవన్‌నకుగాని అనుమానముకల్గకుండ శవమును ఆనిశీథమున తానే దీసుకబోయి దూరమున రోడ్డుపైనిడి గృహోన్ముఖుండయ్యెను.

రమేశుడటుల బయలువెడలి త్వరితగతి నగరముజేరి రాజబాట వెంబడివచ్చి మదన్‌లాల్ గృహమువైపు మరలెను. రామచంద్‌నకేమి సంభవించెనాయని ఆందోళితాంతఃకరణుడై వచ్చుచుండెను. అంతలో ఆతనిపాదమున కేదియో మెత్తగతగుల అదరిపడెను. వెంటనే ఆగి జూడ ఎవరిదో మానవకళేబరము. రమేశుడంత తనజేబునందలి టార్చిలైటు సహాయమున పరిశీలింప తనభృత్యుడు రామచంద్. రామ్‌చంద్ ! రామ్ చంద్ ! హా ! ఎంతదారుణముగ హత్యగావింపబడితివి. నీచు డామదనుడే నిన్నిట్లుగావించియుండును. నేనిప్పుడే వానితుదముట్టించి నీఆత్మకు శాంతి జేకూర్చెదననుచు పట్టరాని ఆవేశమున త్వరితగతి మదనుని గృహముజేరెను. గృహమంతయు నిశ్శబ్దముగనుండెను కవాటములన్నియు బంధింపబడియున్నాయి. రమేశునికేమియు తోచుటలేదు. యింటిచుట్టు నొకపరితిరిగివచ్చెను. గృహము వెనుకవైపునుండి గేటునుదాటి యింటి పైకప్పుజేరి వెలుతురునకై పెట్టబడిన యద్దముజేరెను. మెల్లగ నా యద్దము నూడబెరికి లోపలికిదిగెను. రమేశుడుదిగిన ప్రదేశమంతయు అంధకారము. మెల్లగ తడుముకొనుచు గోడనున్న స్విచ్చినొక్కెను. దీపమువెలుగున అది వంటగదియని గ్రహించి వేరొకగదిలోనికిజని య టుల గృహమంతయు కలయవెదకి ఎట్టకేలకు మందసమున్నగదిఁ జేరెను.

అందొక వ్రాతబల్ల, చక్కటిమంచము, అందమగు చిత్రరువులతోడను ఆగదినిండియుండెను. బహుశః అది మదనుని పడకగదియని తలంచెను. అంతలో కోటునందలిగడియారము టంగుటంగుమని పండ్రెండుకొట్టెను. ఆసమయమున టార్చిలైటు ప్రయోగించుట ప్రమాదమనియెంచి రమేశుడు ఆచీకటియందు తడుముకొనుచు మందసముజేరబోవ నంతలో ఏదియో కాలికిదగిలి బ్రద్దలగుచు ధ్వనిచేసెను. మదన్‌లాల్ రామచంద్ శవము నటవీడివచ్చి నిమిరించెను. ఆశ్బ్దమున కదరిపడి లేచిజూడ ఏమియు గాన్పింపదు. గదియంతయు చీకటిమయము. తాను నిమిరింపబోవునపుడు విద్యుద్దీపముల నార్పలేదు. ఎవరైన యిందు ప్రవేశించిరా ? అందుకు అవకాశములేదే ? ఏమో తానేమైన ద్వారముబంధింప మరచెనేమో ? లేక రమేశుడే యరుదెంచెనా యను అనుమానము, భయము లొక్కుమ్మడి మదన్‌లాల్‌ను కలచివైచెను. ఎట్టకేలకు ధైర్యమునలేచి విద్యుద్దీపమువెలిగించెను. గదియంతయు నొకపరిజూచెను. మందసముచెంత రమేశునిజూచెను. చేత పిస్టలుతోనున్న మదన్‌లాల్‌ను రమేశుడు జూచెను. ఇరువురకు ఒకరిపైనొకరికి భయముకలదు.

మదన్‌లాల్ రమేశు డెటులరాగల్గెనో తెలుసుకొనజాలకుండెను. ద్వారములన్నియు బంధింపబడియుండ యితడెటుల ప్రవేశించెగల్గెనా యని తలంచెను.

నీచుడగు మదన్‌లాల్‌ను గాంచుటతోడనే రమేశున కిక కోప మతిశయింపజొచ్చెను.

'మదన్‌లాల్ ! ఏమి నీచమంత ! ఒకబంటుని హత్యగావించితివా! ఇదిగో ! నేనేవచ్చితి ?

'ఏమనెదవు ?'

'ఏదీ ! నాధనము ?'

'నీధనము ! నీధనమా ?' నీకేమైన పిచ్చియెత్తెనా ?'

'మిత్రద్రోహీ ! ఇక వాచాలత్వముమానుము. ఇచ్చెదవాలేదా?'

'ఏయ్ ! నేనెవరనో ఎఱుంగుదువా ? బారిష్టరుమదన్‌లాల్ ! జాగ్రత్త ! నిన్నీక్షణముననే.........'

'ఏమి అంతవరకు వచ్చెనా నీపొగరు జూచెద. నీప్రాణములపై ఆశవీడుమనుచు అంగీయందలి రివాల్వరుదీసి గురిజేసెను. కాని అందు మందుగుండ్లులేవు. పాపము తొందరగ వచ్చుటలో రమేశుడాసంగతి మరచెను.

మదన్‌లాల్ యిదికనిపెట్టి తనజేతనున్న పిస్టలుతో రమేశుని నుదుటిపై గురిజూచి ప్రేల్చెను. రమేశుడు తప్పించుకొనుటలో భుజముపై గాయపడెను. అంత రోషావేశమున ఆకలిగొన్న సింగమువలె మదనునిపై కలియబడెను. యిరువురకు బలమైన పోరాటము జరిగెను. అందు మదన్‌లాల్ కొట్టినదెబ్బచే తెలివితప్పి పడిపోయెను. గాయముజెందినను మదన్‌లాల్ లేనిబలమున అదియె సమయమని రమేశుని కాలుసేతులు బంధించి దుర్గంధ భూయిష్ఠమగు నొకగదియందు బంధీకృతుని గావించెను.

---

## రెండవ ప్రకరణము.

### రెండవ హత్య.

కలకత్తానగరమున ప్రఖ్యాతివహించిన పురుషులలో జమీందారు అజితబాబుఒకడు. అజితబాబు తన శరీరవిశ్రాంతికై బాలీగంజియందలి నొక సుందరభవనము నద్దెకుగొని అచటనే వైద్యులసలహాపై విశ్రాంతి గైకొనుచుండెను. భవనముచుట్టును వివిధఫలపుష్పాదులతో నిండి యున్నది. సాయంసమయములందు చల్లగాలియందు విశ్రాంతిగైకొను టకు రమ్యోద్యానవనమును దానికిమధ్యగ నొక కొలనుగలదు. పుష్ప

లతాదులచే నావనమంతయు సువాసన లీనుచుండెను. ప్రభాకరుని కాంతు లా వనమందలి పుష్పలతాదులపై బడ నీరెండవేళ కడుముదంబు గొల్పుచుండును.

అజితబాబు నగరమునుండి అప్పుడేవచ్చెను. హాలునందు మనోరమ పుస్తకము నొకదానిని చదువుచుండెను. అంతలో అజితబాబు అరుదెంచెనని తెలియ దాది కాఫీ ఫలహారములు నటనిడి వెడలెను. తండ్రీ కుమార్తెలిరువురు సంభాషించుచు ఫలహారములు సేవించుచుండిరి. అంతలో శంకరలాల్ అట కరుదెంచెను. శంకరలాల్ నకు గూడ ప్రత్యేకముగ తెప్పింపబడెను. అనంతరము అందరు లోకాభిరామాయణమునకు గడంగిరి.

శంకరలాల్ గొప్ప భాగ్యవంతుడు. మనోరమ స్నేహితుడు. యిరువురు ఒకబడిలోనే కాలేజీవిద్య ముగించిరి. ప్రప్రథమమున శంకరలాల్ ను మనోరమ ప్రేమించెను. శంకరలాల్ స్ఫురద్రూపి. సుందరుడు. నవనాగరీకుడు. గొప్ప భాగ్యవంతుడు. దానికి తోడు విద్యగలదు యివి యన్నియు మనోహరమ నాకర్షించెను. కాని కాలమొకేరీతి గడచునా? కాలక్రమమున శంకరలాల్ దుస్సాహవాస యోగము దుర్వ్యసనములకు లోనై కడు అపకీర్తి పాలయ్యెను. శంకరలాల్ మనోరమను ప్రేమించెను. తనకోరిక పలుసార్లు ఆమెకెఱింగించెను. కాని నీచుడు వ్యసనాసక్తుడగు, అతని జూచిన రోతజెందు మనోరమ అట్టి తలంపులు వృథాయని పలుమార్లు జెప్పెను. ఆమెచే విసుగొంది శంకరలాల్ యిపుడు అజితబాబునే అడుగదలచివచ్చెను. ఎటులయిన మనోరమ వివాహమాడ దలచెను. శంకరలాల్ వచ్చుటతోడనే మనోరమ అటనుండి వెడలిపోయెను. తుదకు మాటలసందర్భమున శంకరలాల్ తనకోరిక స్పష్టపరచెను. అజితబాబు అదివఱకే శంకరలాల్ నడవడి యెఱిగిన వాడగుటచే అందులకియ్యకొనలేదు. దానితో శంకరలాల్ ఆగ్రహావంతు

డయి కమకోపమున అటనుండి వెడలిపోయెను. తనకోరిక నెరవేరనందుకు చింత, అజితబాబు అనంగీకారమునకు క్రోధము అధికమయ్యెను. బాల్యమునుండి ప్రేమించిన మనోరమ తన నిష్ప్రవమానించి నందుల కామెకు ప్రతీకారము చేయ నిశ్చయించెను. ఎటులయిన వారలపై పగసాధించి మనోరమను చేపట్ట ధృడసంకల్పితుడాయెను.

సమావేశానంతరము మూడవదినము సూర్యు డస్తమించెను. లోకమంతయు చీకటులావరించెను. నిశీథసమయము. ఆకాశమంతయు కారుమబ్బులతో నిండి ఆ నిశీథము భీకరాకృతి నిచ్చుచుండెను. ఉఱుములు మెఱుపులతో గృహములందలి పసిపిల్లలు నిదురింపక యేడ్చుచుండిరి. సంతతధారగ వర్షము కురియసాగెను, వీధులందు జనసంచారములేదు. అట్టితఱి నల్లటి ఆకృతి యొకటి, మనుష్యుడో భూతమో, ఆ అంధకారమున రాజబాటవెంబడిపోవు చుండెను. శరీరమంతయు నల్లటిబురఖాచే కప్పబడి కన్నులు, ముక్కునకు, తప్ప మిగిలిన భాగమంతయు ఆ చీకటి యందు లీనమగు చుండెను. ఆస్వరూపము భూతమని భయపడనవసరములేదు. అటుపోయి అజితబాబు సౌధమువద్ద ఏలనో ఆగెను. కొలదిసేపటిలో ఉద్యానవనమునుండి సౌధముజేరెను. గృహపరిసరమంతయు నిశ్శబ్దముగవుంది. భవనముపైకి బోవ ఆధారమేమియు గానరాలేదు. తుదకు సౌధముపై కెగబ్రాకిన లతాతీగాధారముగోని పైకెగబ్రాకెను. మెల్లగ అజితబాబు గదిజేరి జూడ లోపల విద్యుద్దీపము వెలుగుచుండెను. తనజేబునందలి యినుపవూసను, వేరొకపనిముట్టునుదీసి గవాక్షమువూసలను నవలీలగకోసెను. గదిప్రవేశించి సుఖముగ నిదురించెడి అజితబాబును పేరిడి పిలిచెను. ఆనిశీథసమయమున వర్షమునదుమతిననుపిలిచెడి వారెవరా యన్ని అజితబాబు తటాలునలేచి తన కట్టెదుట భీకరాకారుడగు ఆనల్లటి వ్యక్తిని గాంచగనే నిశ్చేష్టుడయ్యెను. ఇంతలో ఆవ్యక్తి అజితబాబు నుద్దేశించి

'అజితబాబూ! నేనెంత చెప్పినవినలేదు నాకోరిక నెరవేరుటకు నీవొక యడ్డంకి. నీవులేకున్న ఆమెను బలవంతముననైన జేపట్టెద. నాకోరిక తిరస్కరించినందులకిదియే ఫలితమను'చు చేతనున్న రివాల్వరు నాతని వక్షమును గురిజూచి ప్రేల్చెను. ఆభయంకరనినాదము తనలో లీనము జేసుకొనెనో యన ఫెళఫెళమని నొక పిడుగెచ్చటనో పడెను.

మఱునాడుదయమున ఏడుగంటలయింది. రామసరూప్ యథా ప్రకారం అజితబాబుగది శుభ్రముజేయవచ్చిజూడ తలుపులు లోపల బంధింపబడెను. అజితబాబు యింకను నిదురనుండి లేవలేదని పిలచెను. మారుజవాబులేదు. మరలమరల బిగ్గరగ పిలచినను లోనుండి జవాబు రానందున భయపడి మనోరమకీ వార్త యెఱింగించి ఆమె నటకు దీసుకువచ్చెను. ఎటుబోవ మార్గము లేనందున ప్రక్కగవాక్షమునుండి ఏమిచేయుచుండెనో చూచెదమని లోపలగోడవైపు ముఖము త్రిప్పబడి క్రిందబడియుండెను. పాన్పు అంతయు రక్తమయము. గవాక్షపు వూచలు లేకుండుటగాంచి లోనికరిగి రామసరూప్ తలుపులు తెరచి తోడనే నిర్జీవుడై రక్తమయమున పడియున్న తండ్రిని గాంచి మనోరమ భయవిహ్వలయై కెవ్వునకేకవైచి మూర్ఛ పోయెను. అంతలో అజితబాబు కార్యదర్శి గోపీనాద్ ఎప్పటివలె అరు దెంచెను. అంతయు అల్లకల్లోలము. తనయజమాని హత్యావిషయము విని నిశ్చేష్టుడై కొంతవడికి తెప్పిరిలి లోలోన కుమిలుచుచు పైకిలేచి ధైర్యమున మూర్ఛవడి తెప్పిరిలిన మనోరమను వూరడించుచు సేద దీర్చుచుండెను. గోపీనాథ్ ఆభయంకరదృశ్యముగాంచలేక గదితలుపుల తాళమువేయించెను. తనయజమాని ఆత్మహత్యగావించుకొనెనా లేక హంతకుడెవరయిన అందుండి ప్రవేశించి గావించినపనియాయని తలచెను. గోపీనాథ్న కెటుతోచలేదు. ఆత్మహత్యఅయిన గవాక్షపుటూచలేల బద్దలుగొట్టబడెను. అయినను ఆత్మహత్యచేసుకొనవలసిన అవసరమేమి

యులేదే ? ఇన్ని ఆలోచన లొకపరి ఆతనిహృదయమును కలవరపెట్టు చుండెను. వెంటనే సేవకుని ఇనస్పెక్టరుబాబును దీసుకురా పోలీసుస్టేష నుకుబంపెను. ఇంతలో ఊరకతండ్రికై విలపించెడి అమాయికబాల మనో రమను ఓదార్చుచుండెను.

మనోరమకు సుమారు పదునారువత్సరములుండును. ఆకారము నకుతగినపొడవు, చక్కటిశరీరలావణ్యము, బంగరుఛాయి, కలువరేకుల బోలునేత్రద్వయము, తుమ్మెదరెక్కలబోలు నల్లనిముంగురులుగల్గి అపర రతీదేవివలె యొప్పారుచుండెను. అజితబాబున కొక్కతెయేకుమార్తె యగుటవలన తల్లిలేనిలోటులేకుండ తనకన్నులలో పెట్టుకొని పెంచెను. రూపలావణ్యములు, సంపద, వినయవిధేయతలకుతోడు విద్యావతి. మనోరమకు అనేకగొప్పసంబంధములు వచ్చుచున్నను అజితబాబు మనో రమ పట్టుదలచే బి. ఏ. ప్యాసగువరకు ఆగెను. ఇంతలో ఆకస్మికముగ మృత్యువాతబడునని ఎవరెఱుంగుదురు ! పాపము ! మనోరమ దిక్కు లేనిపక్షిఅయిండె. ప్రేమార యికతండ్రీ యుని పిలుచుకొన నోచుకొన లేదు.

అప్పుడే సుప్రసిద్ధజమీందారు అజితబాబు హత్యగావింపబడెనని నగరమంతయు వ్యాపించెను. ఆనాటి పేపరులన్నిటియందు అజితబాబు హత్యావిషయమే ! ఇంతలో కారుపై సేవకుడు ఇనస్పెక్టరురాఘవన్ వచ్చిరి. గోపీనాథ్ వారల కెదురేగి రాఘవన్‌ను పైకిదీసుకబోయి ఒక గదియందు గూర్చుండజేసెను. అటనుండి రాఘవన్ అజితబాబు గదిజేరి తనడైరీయందు వ్రాయవలసిన రిపోర్టుఅంతయు నోటుజేసుకొని యీవల కరుదెంచెను. అంత వారీవిధముగ సంభాషించిరి.

రా—గోపీనాథ్‌గారూ ! అజితబాబుగారు మీబంధువులా ?

గో—కాదు ! నే వారి ఎస్టేటువ్యాపారములనన్నిటిని చూచు మేనేజరును. ఈమె వారి కుమార్తె మనోరమ.

రా—అటులనా ? అజితబాబుగారు ఆత్మహత్య గావించుకొనె ననియా లేక హత్యగావింపబడెననియా మీతలంపు.

గో—ఆత్మహత్యగాదని నాయభిప్రాయము. అందులకు నిదర్శనముగ గవాక్షము బ్రద్దలు జేయబడియున్నది.

రా—అవును ! అటులయిన యీాయన కెవరయిన శత్రువులు కలరా !

గో—ఎవరునులేరు ఎవ్వరితోడను విరోధములేదు. ఎదుటిమనిషి మనస్సు కష్టపెట్టరు. దయార్ద్రహృదయులు. అందరు స్నేహితులే ! ప్రభుత్వమునను, సంఘమున మంచిపేరుగలదు.

రా—అయిన యింతకుపూర్వ మెవరితోనైన వివాదపడుటగాని వారి ఆగ్రహమునకు లోనగుటగాని జరిగెనా ?

అంత మనోరమ తానుజెప్ప సాహసించక అంతకు జరిగినదినమున శంకరలాల్‌కి తనతండ్రికి జరిగిన వివాదమును గోపీనాథ్‌తో జెప్ప అతడు రాఘవన్‌నకు తెల్పెను.

రా—శంకరలాల్ ! యీపేరిదివరకు విన్నట్లున్నదే ! హత్యజరిగిన ప్రదేశమున ఏమయిన వస్తువులున్నవా ?

గో—యిదుగో ! యీారివాల్వరు పరుపుపై పడియున్నది. యింతకుమించి ఏమియు దొరకలేదు.

'గోపీనాథ్‌గారూ ! హత్యావిషయము ప్రస్తుతమేమియు తెలియుటలేదు. మీారు శవమును దహనకరుపవచ్చు' నని తనరిపోర్టు పూర్తిజేసి యట నలువుర రక్షకభటుల కాపలాపెట్టెను. హత్యావిషయమంతయు అగమ్యగోచరముగ నుండెను. హంతకుడు కడునేర్పుతో వ్యవహరించెను. అజితబాబు హత్యగావించుకొనుననని తలంతురని రివాల్వరట వదలిపోయెను. ఆతడెవరో యీావిషయములం దారితేరిన వాడని తెలియుచున్నది. భయపడవలదని విలపించుచున్న మనోరమను

ధైర్యముచెప్పుమని హెచ్చరించి గోపీనాథుతో మరల సాయంకాలము వత్తునని బయలుదేరెను. రాఘవుడా యిటు లాందోళితమనస్కుడై మతిచెడినవానివలె తానాజేరెను.

---

## మూ డ వ ప్ర క ర ణ ము.

### స్వ ధ న ము.

అటుల స్వధనమునకై బయలువెడలిన రమేశబాబు యెంతకు రానందులకు రామచంద్రవలె యీతనికేమైన యిక్కట్టు సంభవించెనా యని రమేశుని యనుచరులందరు చింతిలుచుండిరి. ఎంతనిరీక్షించినను రమేశునరుదెంచుజాడ తెలియనందున మిత్రులందరు కలసి సమర్థుడగు బెంటువుడ్‌నంపిరి. మిత్రులవద్ద సెలవుగైకొని బెంటువుడ్ నగరము జేరెను. రాత్రి సుమారు పదిగంటలయిుంది. మదన్‌లాల్ గృహము వెలుపల బీగము వేయబడియున్నది. పరిసరమంతయునిశ్శబ్దముగనుండెను. గృహప్రాంగణమున మాత్రము సేవకుడొకడు పహరానిచ్చుచుండెను. మెల్లగ ముఖద్వారముజేరి ఆచీకటియందు సమయమునకై వేచియుండెను. తనజేబునందలి సీసానొకదానిని వెలుపలికి దీసియుండెను. అటుల రెండు గంటలు దాటెను. ఇంతలో లోనుండి గడియారము పండ్రెండున్నర కొట్టెను. పహరాజవాను నిదురవచ్చుననికాబోలు నొకపరి హుక్కా పీల్చి గృహమంతయు చుట్టివచ్చి తూలుచు ఒకచో చతికిలబడెను. అప్పటికి సుమారు రెండుగంటలగును. అదియె సమయమని బెంటువుడ్ పిల్లికంటె మెల్లడు జాగ్రతతో సవ్వడిగాకుండ వెనుకతట్టునుండి ఆతనిని సమీపించి నోరుమూసి సీసా నాసికారంధ్రములకడనిడ ఒకత్రుటిలో నతడు స్మృతిహీనుడై నేలకొరిగెను. వెంటనే ఆతని మొలనున్న

తాళపుజెవుల సహాయమున సింహద్వారముదెరచి యెప్పటి యటుల తన వెనుక తలుపులు బంధించి లోనికరిగెను. లోపలయంతయు చీకటి మయము. తన టార్చి సహాయమున యందలి విద్యుద్దీపము వెలిగించెను. అటుల గృహమంతయు నొకగదివెంబడి మరియొక గదివెదకెను. రమే శుని జాడ కన్పడలేదు. రమేశుడొకవేళ హత్యగావింపబడెనేమో యని భయపడెను. ఇటుల దీనవదనుడై ఆలోచించుచుండ కొలదిసేపటికి ఎట నుండియో దీనమగు మూల్గు వినవచ్చెను. మరల వినవచ్చునేమో యని తలచి వేచియుండ అదేవిధమున వినవచ్చెను. వెంటనే రమేశు డెటనో బంధీకృతుడై యుండునని మూల్గువినవచ్చినదెస బయలు దేరెను. తుదకు తానున్న గదికి ఉత్తరముగ మూడు గదులు దాటుసరికి తన కుడిప్రక్కన వెలుపల బంధింపబడియున్న గదిజూచెను. అదియే రమే శుడుండు గదయని తలచి బీగముదీయ ప్రయత్నించి తను సహారా జవానువద్ద తీసుకొనిన తాళపుచెవులగుత్తినందలి నొక్కొక్కదానినే ప్రయత్నించెను. కాని విఫలమనోరథుడయ్యెను. తాళమెటుల వచ్చునా యను ఆలోచన యొకటి. యింతలో ఏసమయమున మదన్‌లాల్ వచ్చు నేమోయను భయము ఆతని మానసము కలవరపెట్ట త్వరితగతి గది యంతయు నేదైన ఆయుధము దొరుకునేమోయని వెదకెను. ఎట్టకేలకు తననేర్పిన యినుపప్రాచవలెనుండి సన్నని అంపమువలెనున్న పని ముట్టులు మదనుని బీరువానుండి సంగ్రహించి గొళ్ళెము నంతనుకోసి తన ప్రయత్నమున సఫలుడయ్యెను. చేతటార్చివెలిగించి గదియందు అడుగిడెను. లోనుండి దుర్గంధభూయిష్టమగు దుర్వాసన గొట్టుచు నేల యంత చెమ్మగిలి యుండెను. పాపము రమేశున కంతకు మూడుదినముల నుండి ఆహారము లేనందున ఆచీకటియందు కృశీభూతశరీరుడై నేలపై పండ చావయయినలేక కాలుసేతులు బంధింపబడి ఆతడు నేలపై వడి యుండుట గాంచి బెంటువుడ్ మనస్సు ద్రవీభూతమయ్యెను. బెంటువుడ్

త్వరితగతి రమేశుని బంధనముల విప్ప జేబునందలి వేరొక సీసాదీసి రమే శునకు వాసనజూప కొలదిసేపటిలో నధిక బలవంతునివలె రమేశుడులేచి నిలబడెను. కొలదిసేపటికి అటు నిటు నడవగల్గెను. ఇక ఆలసించిన కార్య ముచెడుననని అటనుండి తొందరగ మదన్‌లాల్ పడకగదిజేరి మందసము జెరువ తాళములజెవ్వులకై వెదకసాగెను. హాలునందలి గడియారము మూడుకొట్టెను. ఎచ్చటను మందసపు తాళపుజెవులు కానరానందున బెంటువుడ్ తానుదెచ్చిన పసరు కొంత నందుంచ వెంటనే నాభీగము విడెను. ఇంతలో గృహప్రాంగణమున కారుఆగిన శబ్దమువినవయ్యెను. కొలదిసేపటిలో నాభీగము వీడిరాగా రమేశుడు తన ధనము నంతను దీసి జాగ్రతపరచి యికబో నుద్యుక్తులయి వెనుదిరుగుసరికి తమకెదురుగ రివాల్వరు చేతబూని మదన్‌లాల్ వచ్చుచుండెను. కాలముమించెను. పాపము రమేశుడేమిచేయును. చేత నాయుధమేమియులేదు. బెంటువుడ్ వద్ద రివాల్వరుగలదుగాని అంగీయందుండెను. అప్పటి కప్పుడే మదన్ లాల్ దగ్గరకు సమీపించెను. సమయము మించినది.

'ఒహ్హో ! రమేశ్ బాబుగారా ! యిటనుండియే పోనుద్దేశించితిరో! నీరసాయనిక శాస్త్రవేత్త యిపుడేమిచేయగలడు. ఒకపరి పట్టువడిన యీమదనుని చేతులనుండి తప్పించుకొనుట కష్టతరమని యెఱుగవు కాబోలు !

'నీచుడా ! మిత్రద్రోహివై నన్ను కడునిడుములబెట్టిన నీపై పగసాధింపలేనా ! ఓపికవహింపుము. దేనికైన సమయము రావలెగదా ?

'ఏమిమాటలు మీరుతున్నవే ! మిత్రద్రోహి ! జాగ్రత. ఆధన మట నుంచుము. లేనిచో నీప్రాణము లీక్షణముననే గొనుటకు చేత నాయుధముజూచితివా ! '

రమేశుడది సమయము కాదని తలచి 'ఇదిగో గైకొను' మనుచు చేతనున్న ధనసంచి నటనుంచుటయు మదనుడు దానినందుకొన ప్రయ

త్నింపజోవుటయు అంత దనుక పొంచియున్న బెంటువుడ్ మదనునిచేతిపై తన రివాల్వరుతో కొట్ట నతని రివాల్వరుబోయి దూరమునబడెను. రమేశుడు వెంటనే దానిని జాగ్రతపరచెను. మదన్‌లాల్ యికచేయునదేమి? ఒకక్షణములో యింతకు పూర్వము రమేశునిస్థితి తానుపొందెను.

ఎటులయిన మాయోపాయమున వారలవద్దుపెట్ట ఆలోచించుచు వారలకు లొంగిపోయినవానివలె నటింపమొదలిడెను. ఇంతలో బెంటివుడ్ మందు మత్తుబోయెనుకాబోలు యీగడబిడివిని మదన్‌లాల్ సేవకుడు చేతపిస్టలుతో వచ్చుచుండెను. వెంటనే బెంటివుడ్ రమేశుని మదన్‌లాల్‌ను జాగ్రతగజూచుచుండుమనిచెప్పి తాను సేవకు డికగదిప్రవేశింప బోవుచుండ తనరివాల్వరుకు పనిగల్పించెను. అంత సేవకునిచేతనున్న పిస్టలు దూరమునబడుటయేగాక చేయిగాయపడెను. సేవకుడు క్రింద బడిన పిస్టలుకై ప్రయత్నింపబోవ నొకపరి కాళ్ళపై గురిజూచిప్రేల్చ కదలలేక యటనే రోజుచు సేవకుడు పడెను. సత్వరమాతని బంధీకృతుని గావించెను. రమేశుడిటు దృష్టిసారించునంతలో యిదియె అదనని వెనుక నుండి మదన్‌లాల్‌పై బడెను. రమేశుడు తన మందబుద్ధికెంతయు నొచ్చుకొనెను. ఇరువురకు బలమైన పోరాటమయ్యెను. రమేశు దనకు రివాల్వరుపయోగించ నిష్టములేక పెనుగులాడుచుండెను. ఇంతలో తనచేతి రివాల్వరు మదనుని హస్తగతమయ్యెను. పోరాటమున యిరువురు గాయపడిరి. మరల పరిస్థితులుమారెను. కాని దైవముగలడుగదా ?

'రమేశ్ ! ఇపుడేమయ్యెదవు. ఇదుగో యీక్షణముననే......' అనుచు నిర్దాక్షిణ్యమున రమేశునికాల్చబోవునంతలో ఎటనుండియో ఢాం అను శబ్దము వెనువెంటనే శిరమునుండి రుధిరముస్రవించ 'అయ్యో!' అనుచు మదన్‌లాల్ క్రిందబడుటయు జరిగెను. రమేశునకు మతిలేదు. తనను రక్షించినవ్యక్తిఎవరాయని నిశ్చేష్టుడై తిలకించుచుండెను. ఇంతలో హాలునుండి ఒకవ్యక్తి వచ్చుచుండెను. ఆతడెవరోయని పాఠకు లాతురత

జెం ౯క్కరలేదు. అప్పుడే తనపని ముగించుకొనివచ్చిన బెంటువుడ్ ఆల సించి ప్రమాదమని తమధనమునుదీసుకొని రమేశు బెంటువుడ్ లిరువురు మరి ాల్ కారుపై నెక్కి తమ గమ్యస్థానముఁజేరిరి.

---

## నా ల్గ వ ప్ర క ర ణ ము.

### ఆ లో చ న.

ఉదయము తొమ్మిదిగంటలయింది. పోలీసుఠాణాయందు యినె స్పెక్టరురాఘువన్ అజితబాబు హత్యావిషయమై దీర్ఘముగాఆలోచించు చుండెను. అంతలో గోపీనాధ్ అటకరుదెంచెను. రాఘువన్ గోపీనాధ్‌ను గాంచుటతోడనే తలవంచుకొనెను. అతనికేమిసమాధానము జెప్పవల యునో తెలియదు. అయినను తప్పనిసరిగలేచి వానినాహ్వానించి నొక కుర్చీయందు గూర్చుండమనిజెప్పెను.

గోపీ—ఇనస్పెక్టరుగారూ ! హంతకునిజాడలేమైన తెలిసినవా? యని ప్రశ్నించెను.

రాఘు—ఎంతప్రయత్నించినను యింతవరకు సరియైన ఆచోక్కీ తెలి యలేదు. ఇదిజూడ కడుదుర్భేద్యముగనున్నదే ! విరోధులెవ్వరులేరు ! ఆత్మహత్యకాదు !

గోపీ—నేజెప్పినగురుతులబట్టి శంకరులాల్‌ను గుర్తింపనేలేదా ?

రాఘు—ఆతఁడు మారువేషమున సంచరించుచుండెనేమో ?

గోపీ—అయివుండవచ్చును. ఆతడు కడుమాయావి.

రాఘు—ఎట్టెనిగూఢహత్య ! హంతకుడు గొప్పచతురుడు. మేధా విఅయియుండవలెను.

గోపీ—మీరెటులయిన యీవిషయమును కడుశ్రద్ధవహించి పనిచేయవలయును.

రాఘు—తప్పక. వేరేచెప్పవలయునా ? పాపము మనోరమ ఎటు లున్నది.

గోపీ—విద్యావతి, జ్ఞానవంతురాలైనను తండ్రిమరణమున వూరక విలపించుచు అన్నపానీయముల ముట్టుటలేదు.

రాఘు—మీరామెవిషయమై జాగ్రతవహించుడు. యింతకు ముందే తెలిసినవార్తలబట్టి పార్కురోడ్డున వారలుండునటుల తెలిసినది. అంత ఆధారమైనవార్తకాదని నాతలంపు. నేనేస్వయముగ యీవిషయమున ప్రయత్నించి ఆనీచునిపని పట్టించెద. మీరధైర్యపడకుడు. మనోరమను భద్రముగ జూడుడని చెప్పెను.

అప్పుడే గదియందలిగడియారము 11 గంటలుకొట్టెను. ఇక సాయంకాలము కలుసుకొనెదనని గోపీనాథ్‌ను సాగనంపి తానిలుచేరెను.

## రహస్యము బయటపడుట.

అప్పుడే హత్యజరిగి మూసముదినములయింది. హత్యజరిగిన నాటనుండి శంకరలాల్ ఛద్మవేషమున తిరుగుచు రక్షకభటశాఖాధి కారులకు జిక్కకుండెను. కుతంత్రుడు, దుర్వ్యసనాసక్తుడగు శంకరలాల్ ఎప్పుడు మనోరమను చేజిక్కించుకొందమాయని సమయమునకై వేచి యుండెను.

మదన్‌లాల్ ఆనాడటుల పరాభవముజెంది తన శత్రువగు రమేశుడే స్వయముగవచ్చి తన్నట్లుగావించి తన కండ్లయెదుటనే ధన మంతయు పట్టుకొనిపోవుట తలచుకొని హతాశుడయ్యెను. యిక చేయున దేమున్నది. దేనికొరకై తాను మిత్రద్రోహము గావించెనో యట్టి ధనమంతయు నొకత్రుటిలో మాయమయ్యెను.

రమేశునిజాడ లరయ తన భృత్యుల పలువుర నలుదిక్కులకు బుత్తెంచెను. అందరు విఫలురయి వచ్చిరి. సాయంత్ర మయిదుగంటలు దాటెను. కృష్ణదేవుడేలనో రాలేదు. ఒకవేళ ఆతడింకను తన ప్రయత్నములు గావించుచుండెనో లేక వారలచే పట్టుబడి యిడుములగుందుచుండెనోయని మదన్‌లాల్ ఆలోచించసాగెను. చీకటిపడింది. రోడ్లపై అచ్చటచ్చట నున్న విద్యుద్దీపములకాంతితప్ప వేరొండేమియులేదు. ఆలోచనాపరుడయి సలహానిచ్చుటకు రాఘవన్ అయిన రాలేదేయని నిస్పృహజెందెను. యిటుల సుమారు రెండుగంటలుదాటెను. గోడనున్న గడియారము టంగుటంగుమని తొమ్మిదికొట్టెను. ఇంతలో కృష్ణదేవుడాయాసమున వగర్చుచు వచ్చెను. ఆయాసమున ఆతనినోట మాటరాకుండెను. మదన్‌లాల్ అతనిని కూర్చుండ నియమించి కొలది బ్రాందిని గ్లాసునందలి నీటితో కలిపి యివ్వ కృష్ణదేవుడదిసేవించి యటుపై తనవృత్తాంతము చెప్ప మొదలిడెను.

'అయ్యా! నేనటుల తమయొద్ద సెలవుగైకొని నగరమున నేనెరిగిన ప్రదేశములన్ని వెదకితిని. ఎందును రమేశునిజాడ గానరాలేదు. తిరిగియుండుటచే ఆకలి దహించుచున్నది. అప్పటికి సుమారు ఆరుగంటలయింది. అంత మన విల్సన్‌కేఫున కేగితిని. అందుప్రవేశించి ఒకసారి నలుదెసలచూచితిని. నొకమూలగ రమేశునివలెనున్న వ్యక్తి వేరొకనితో మాట్లాడుచు ఫలహారముల సేవించుచుండిరి. నాసందేహము తీరుటకై నేనును వారల సమీపముననే కూర్చుండి ముఖలక్షణముల పరికింప మొదలిడితిని. మీరుచెప్పినట్లు రమేశునివలె నున్నవ్యక్తి ముఖమున గాయపుగుర్తు గలదు. అంతటితో అనుమానముతీరక వానిని వెంబడించి ఆతనినెలవు తెలుసుకొనవలెనని నిశ్చయించితిని.

ఇంతలో ఆయాసమున గ్లాసునకై సౌజ్ఞచేయ మదన్‌లాల్ మరల బ్రాందితో గ్లాసునింపి యిచ్చెను. అవలీలగ కృష్ణదేవుడది ఖాళీచేసి మరల నిటుల మొదలిడెను.

'వారలసంభాషణవిన ప్రయత్నించినను చాలనెమ్మదిగ మాట్లాడు చుండుటచే స్పష్టముగా వినబడలేదు. కాని మధ్యమధ్య మదన్‌లాల్— యీరోజుననే......కర్తవ్యము......అనుమాటలు వినబడెను. దానిని బట్టి మనపై వారలేదియో కుట్రపన్నుచుండిరని భావించితిని. ఇంతలో వారిరువురు అటనుండి లేచి తమ బిల్లులనిచ్చి బయలుదేరిరి. రమేశుడు తనకారు లధిరోహింప సిద్ధముగనుండెను. నేనును త్వరితముగ బిల్లునిచ్చి యీవలకరుదెంచి జూడ పరిసరముల జనసమర్ధములేదు. ఇంజను స్టార్టు చేయబడినధ్వని అయింది. అంత ఆచీకటియదను జేసుకొని కారు వెనుక భాగమును ఆసటగాగొని కూర్చుంటిని. కారు కడువేగమున నగరవీధుల బడి పోవుచుండెను. ఆచీకటియందు మెయిన్‌రోడ్డువీడి ప్రక్కవీధులు సందుగొందు లెన్నితిరిగెనో తుదకు నొకయింటిముంగిట ఆగెను. కారు గృహప్రాంగణమున ఆగినశబ్దమవగా లోనుండి కవాటములు తెరువబడి నలువురు ధృఢకాయులువచ్చిరి. వారలకేవియో ఆజ్ఞాపించి రమేశుడు లోనికరిగెను. వెంటనే శకటమధిరోహించి యెటకోబోయిరి. అంతదనుక ప్రహరీగోడ నీడనుదాగి పరిశీలించుచున్న నేను బయటికరుదెంచితిని. పరిసరమంతయు నిశ్శబ్దము. అదియే వీధికి చివరగృహము. లోపల కేటుల ప్రవేశము గల్గునాయని ప్రయత్నించితిని కాని విఫలమనోరధుడ నయితిని. పైకి జూపరులకు గృహమంతయు పాడుపడి శిథిలావస్థలో నున్నట్లు గాన్పించును. అంత ముఖద్వారముజేరి నాచీకటి యందా నెంబరు నోటు జేసితిని.

మరలమరల మదన్‌లాల్ నిండుగ్లాసులందిచ్చుటయే తడవుగ కృష్ణదేవుడు త్వరితగతి ఖాళీచేయుచుండెను. మదన్‌లాల్‌నకు తన బృంద ములో నెవ్వరిని హింసించడు. మర్యాదగజూచి వారల తగురీతి సంతోషపరుపుచుండును. అందున వారు తమయజమానియెడ భయ భక్తులతో మెలంగుదు అతనికై తమ ప్రాణములనైన నర్పింతురు.

అందరిలో కృష్ణదేవుడనిన మదన్‌లాల్‌న కారవప్రాణము. మరల కృష్ణ దేవు తనకథ యిట్లుల చెప్పెను.

'నెంబరు నోటుజేసుకొని యీవల కరుదెంచి నచ్చుచుంటిని. అది 127 నెంబరు గృహము. కాని ఎచ్చటున్నదో అది ఏప్రదేశమో ఆ అంధకారమున తెలియలేదు. కొలదిదూర మేగుసరికి అప్పుడె సినిమా నుండి వచ్చెడి వ్యక్తులలో నొకనిని యడుగ యది చౌబజారని చెప్పాడు. అప్పటికి మనసు కుదుటబడినది. అందుండియే రమేశుడిటుల తన యిష్టమునవచ్చినటుల ఆడుచుండెను. రేపు ఇనస్పెక్టరు రాఘవన్ సహాయమున ఆగృహము ముట్టడించిన ధనము రమేశుడేగాక ఆతని పరివారమంతయు పట్టువడును. ఈసంగతి తెలియపర్చ వచ్చినాడ'నని కృష్ణదేవుడుపలుక ఆతని చాకచక్యమున కెంతయు సంతసించి నిండుగ్లాసు అందిచ్చెను. మఱునాడు రాఘవన్ సహాయమున రమేశునిగృహము ముట్టడించి తన మనోరథము నెరవేర్చుకొనవచ్చునని తలంచి లోలోన సంతసించుచు నిద్రాపరవశుడయ్యెను.

## పా ప ఫ ల ము,

మఱునా డుదయముననే మదన్‌లాల్ యీసంగతి రాఘవన్‌నకు దెలుపబోయెను. తొందరగ అప్పుడేవచ్చెను. ఠాణాయందలి అప్పుడేవచ్చిన వార్తాపత్రిక జదువుచుండెను. మదన్‌లాల్ వచ్చుటతోడనే 'ఏమి విశేషముల'ని ప్రశ్నించెను.

మ—ఇనస్పెక్టరుబాబూ! నేనొక ముఖ్యవిషయము తెలుసుకొంటిని. రహస్యముగా మాట్లాడవలయును.

అంత రాఘవన్ అటనుండి తన ప్రయివేటురూమునకు దీసుకబోయి గూర్చుండజేసెను. మదన్‌లాల్‌గారూ! 'ఏమి రమేశుని గూర్చియా?'

మ.—అవును ! రమేశుడుండుతావు తెలుసుకొంటిని.

రా—ఏమి ? రమేశుని నివాసమా ? ఎట్లుల ? ఎవరివలన ! అని అశ్చర్యమున నొక్కపరి ప్రశ్నలవర్షము గురిపించెను.

మ.—అవును ! మన కృష్ణదేవుడు కనుగొని వచ్చినాడని జరిగిన సంగతియంతయు విశదపరచి ఆనాటిరాత్రియే ఆగృహము ముట్టడింప వలెనని పల్కెను.

రాఘవన్ యీవార్తకెంతయు సంతసించెను. రమేశుడిక తనచే పట్టుబడుటయేగాక ప్రభుత్వమున తన పేరు ప్రతిష్టలు మూరుమ్రోగునని లోలోన ఆనందపరవశుడయ్యెను. ఎప్పుడు రాత్రియగునా యని తొందరపడ జొచ్చెను. పలువుర రక్షకభటుల సాయుధులై యుండవలసి నదిగ ఉత్తరువిచ్చెను.

చీకటిపడింది. రాఘవన్‌నకు తొందర ఎక్కువయ్యెను. అప్పటికి సుమారు పదిగంటలవుతుంది. అంతలో మదన్‌లాల్ చక్కటి యుడుపుల ధరించి వీరునివలె వచ్చెను. ఆతనిముఖమున ఆనంద ముట్టిపడుచుండెను. అంత రాఘవన్, మదన్‌లాల్, కృష్ణదేవులు పలువుర రక్షకభటులతో కారుపై రమేశుని గృహమువైపు బయలుదేరిరి. ఒక అరగంటలో రమేశునిగృహముజేరి కారు రోడ్డునకు ఒకప్రక్కగవదలి కాలినడకను గృహప్రాంగణము జొచ్చిరి. గృహమంతయు చుట్టివచ్చిరి. లోనికి ప్రవేశమునకు వీలులేదు. పరిసరమంతయు నిశ్శబ్దముగనుండెను. సమయమునకై వేచియుండిరి. ఇంతలో ఎచ్చటనుండియో ద్వారము తెరువబడినధ్వని యగుటయు వెను వెంటనే యిరువురవ్యక్తుల సంభాషణ వినపడెను. అందరు ఎవరితావులందు వా రుండిరి.

లోపలనుండి యిరువురు ధృఢకాయులీవల కరుదెంచిరి. మొదటివాని కేదియో రెండవవాడు రహస్యముఁజెప్పి తాను మరల లోనికిబోయెను. ఈకాలములో మదన్‌లాల్ లోనప్రవేశించెను. ద్వారము ప్రక్కనే దాగి యున్న మదనుడు ఆ నూతనుడు లోనికడుగిడుట తోడనే తన పిస్టలుతో శిరముపై కొట్ట వాడు 'ప్రమాద' మనుచు యఱచి నేలకొరిగెను. యింటిలో రాఘవన్ రక్షకభటులతో లోన ప్రవేశించి ఎవరి తావుల వారు రానున్న సంఘటనకై సిద్ధముగనుండిరి. ఆ కేకవిని రమేశుని పరివారమంతయు ఆపదవాటిల్లెనని సాయుధులై వచ్చిరి.

క్రింది హాలంతయు అంధకార బంధురము. అంత నొకవ్యక్తి తన టార్చి నుపయోగించి కోటునందుగల ప్రతి వస్తువుపై ప్రసరింపజేసెను. ఆవెలుగున మదన్‌లాల్‌ను కొంతమంది రక్షకభటుల గాంచెను. ఆత డేమిసౌజ్ఞ చేసెనో నొక్కుమ్మడి రమేశుని పరివారమంతయు కలియబడిరి. ఆ చీకటియందు ఎవరెవరి పక్షమువారో తెలియకుండ ఘోరముగ పోరాటము జరుగుచుండెను. మదన్‌లాల్ తప్పించుకొని రమేశుని ధనము నకై వెదుక హాలునుండి మేడపై భాగము చేరుచుండెను. ఎటనుండియో రివాల్వరు ప్రేల్చబడెను. పాపము! మదన్‌లాల్ కది భుజములపై తగి లెను. మదన్‌లాల్ దానికి ప్రతిగ ప్రేల్చుటయు ఎవరో 'అయ్యో!' అని మూలుగుచు మెట్లనుండి క్రిందబడుటయు జరిగెను. మరల మదన్ లాల్ తనప్రయత్నము కొనసాగింప మెట్లనెక్కెను. ఇంతలో మరియొక సారి గుండుప్రేలెను. ఆ ర్తనాదమునుబట్టి మదన్‌లాల్ అది రాఘవన్‌గా గ్రహించి వెంటనే క్రిందికి వచ్చెను. అటుల ఆ గృహమంతయు కేకల తోను, రివాల్వర్లు ప్రేలెడి ధ్వనులతోను నిండి అప్పటి ఆదృశ్యము కడు భీకరముగ నుండెను. ఇంతలో హాలంతయు కాంతివంతము చేయబడెను. మదన్‌లాల్ రాఘవన్ లిరువురు రమేశుని పరివారముచే చుట్టు ముట్ట బడిరి. మదన్‌లాల్ అది గాంచి నిశ్చేష్టుడయ్యెను.

ఆ సంకుల సమరమున చాలవరకు మదన్‌లాల్ పరివారము, రక్షకభటులు గతించిరి. మిగిలినవారు రమేశుని వశమైరి. ఆ వెలుంగున వశమైన మదనుని పరివారమేగాక, రక్షకభటులుగూడ తలలువాల్చిరి. అవమాన అపజయము లోకపరిహ్యాదయము దహించుచుండ మదన్‌లాల్ మిత్రుని రమేశుని ముఖము జూడజాలక తన రివాల్వరెత్తెను. రమేశుని జంపుటయే ఆతని యుద్దేశము. రమేశుడది గ్రహించి తన రివాల్వరు గురిజూచెను. కాని మదనుని ఆయుధమా సంఘటనందు ఖాళీయయ్యెను. ప్రయత్నము వమ్మయ్యెను. రాఘవన్, మదన్‌లాల్ లిరువురు బంధీకృతులయిరి. అంత రమేశుడు మదన్‌లాల్ నుద్దేశించి యిట్లు పల్కెను. 'మదన్‌లాల్ ! నీచుడవై నన్నెటులయిన అంతమొందింప పలువిధముల ప్రయత్నించితివి. నాధనముతో కులుక తలంచితివి. మిత్రద్రోహి ! నీవిట్టి కుతంత్రుడవు, ఆశాపిశాచమని యెఱింగిన లండనునందే మట్టుపెట్టి యుందును. ఎన్నటికైన న్యాయాన్యాయముల బరీక్షింప భగవంతుడు లేడా ! అన్యాయము జయమొందునా ? న్యాయము జయమొందునా ? ఇప్పటికైన గుర్తించితివా ?' రాఘవన్ ! యీతని పల్కులు నిజానిజములు తెలుసుకొనక, మనిషి తత్వమునైన యెఱుంగ యీదుర్మార్గునకు సహాయపడుదునని చెప్పినందులకు, కష్టపడి పనిచేసినందులకును బుద్ధికుశలతకు, వివేచనజ్ఞానమునకు మెచ్చి ఆ ప్రభుత్వము నిన్ని అధికారమున నుంచినందులకెంతయు సంతసమగుచున్నది. వట్టి పందవయి నీవేమి డిటెక్టివ్ యినస్పెక్టరు పదవేమి ! ఇకనైన మెలకువతో ప్రవర్తింపుము. లేనిచో ఎరుగుదువా రమేశుని. 'మదన్‌లాల్ ! నీచేసిన దుష్కృత్యములకు ఫలితమిదిగో' యని చేతనున్న రివాల్వరుపయోగించుటయు మదన్‌లాల్ 'అబ్బా' అనుచు మొదలు నరికినవృక్షమువలె, నేలగూలుటయు ఒక్కత్రుటిలో జరిగెను.

---

## అయిదవ ప్రకరణము.

### నూతన సమావేశము.

మదన్‌లాల్ మృతితో రమేశుని కార్యము ముగిసెను. సహజముగ పరోపకారపరుఁడు, దయార్ద్రహృదయుడగు రమేశుఁడు అజితబాబు హత్యావిషయ మెఱుఁగును. కాని స్వకార్యము ముగియనందున తదుపరి ఆలోచింతమని ఊరకుండెను. ఇపుడు దానికితోడు అపరాధపరిశోధనావృత్తియందు అనుభవము సంపాదింపవలెననెడి కోరిక తొందర జేయుచుండెను. ఎట్టకేలకు దృఢనిశ్చయుడై అజితబాబు హత్యాన్వేషణమునకై బయలువెడలెను. రమేశు డటుల ఆలోచనాపరుడై పార్కు-స్క్వేర్ జేరి సమీపముననున్న "గ్రాండ్ రెస్టారెంటు హోటలున కేగెను. కొలదిగ కాఫీ సేవించి అజితబాబు గృహమువైపు బయలుదేరెను. మార్గమున నొకరిక్షా యెక్కెను. రిక్షామనిషి త్వరితగతి అజితబాబు గృహము "వసంతకుటీరము" వద్ద దింప రమేశుడు వాని బాడుగయిచ్చి తాను సౌధము సమీపించెను. సేవకునకు తన నామధేయముగల విజిటింగుకార్డు యిచ్చి పంపెను. పైభాగమున గోపీనాథ్ మనోరమలు ఏదియో ముచ్చటించుచుండిరి. అంత నాసేవకుడు చేతనున్న కార్డు గోపీనాథ్‌న కివ్వ నది యిట్లుండెను.

"రమేశబాబు
పత్తేదారు
కలకత్తా."

వెంటనే మనోరమకన్య ఆమెపైకి ప్రవేశపెట్టమనెను. కొలది సేపటిలో రమేశబాబు అక్కడకు దీసుకరాబడెను. గోపీనాథ్, మనోరమలగాంచి నమస్కరించెను. వారును మరల నమస్కరించి లేచి ఉచి

తాసనమున కూర్చుండ నియమించిరి. అంత వారల కీవిధముగ సంభాషణ జరిగెను.

గో—అయ్యా! తమదీయూరేనా? తమ రెంతకాలమునుండి యీావృత్తియం దుండిరి.

ర—అయ్యా! నాది కలకత్తాయే! నన్ను రమేశబాబుఅందురు. చాలకాలమునుండి సీమయందుండి నేర్చుకొంటిని. అజితబాబుగారు తమ కేమగుదురు.

మనో—రమేశబాబుగారు మాతండ్రి విషయమున మీారు శ్రద్ధగ వ్యవహరింతురా?

గో—రమేశబాబూ! నన్ను గోపీనాధ్ అందురు. నేను చిర కాలమునుండి అజితబాబుగారి ఎస్టేటుకార్యములు జూచుచుంటిని. ఈమె ఆయన కుమారి మనోరమ.

ర—అటులనా? గోపీనాధ్ మేనేజరుగారు మీారేనా? హత్యా విషయమున ఎవరినైన నియమించితిరా?

గో—ఆ! ఇనస్పెక్టరు రాఘవన్‌గారు చాలశ్రమపడుచున్నారు కాని యింతవరకు హంతకుని ఆచోకీ తెలియలేదు.

మ—రమేశజీ! మీారు తప్పక యీాకార్యమున కృతకృత్యు లగుదురని నాకేటికో మిమ్ములజూడ నమ్మకము గల్గుచున్నది. దయ యుంచి ఈదీనురాలి విన్నపము త్రోసిపుచ్చరని నమ్మెదను. ఎంత ధనము వలయునో కోరుడు.

ర—ధనముతో పనియేమి? నేనటుల ధనమున కాశించెడి వాడనుగాను. మీావంటివారలకు సహాయపడుటయే నావాంఛితము.

గో—బాబూ! మాచిన్నియజమానురాలు చెప్పినటుల తమరు గూడ యిందున పనిచేయవలయును.

ర—తప్పక చేయుదును. అయిన అజితబాబుగారి కెవరయిన విరోధులు గలరా ? మీా కెవ్వరిపైనయినను ననుమానము గలదా ?

గో—లేరు. అయన కందరు మిత్రులే ! కాని శంకరలాల్ అను యువకు డీపని గావించియుండునని తలంచెద అని ఆనాడు అజితబాబు శంకరలాల్‌లకు జరిగిన వివాద మెల్ల వివరింపఁజెను.

ర—ఇదియా కారణము. యింక కావలసిన దేమున్నది. తప్పక అతని పనియే. నే నిక సెలవుదీసుకొనెదను. మరి రెండుదినములలో కన బడుమనని అటనుండి వెడలిపోయెను.

## నిర్బంధన

ఇనస్పెక్టరు రాఘవన్ ఎన్ని ప్రయత్నముల హంతకుని కను గొందమన్నను ఫలితము గానరాకుండెను. హత్యానంతరము శంకరలాల్ ఛద్మవేషధారియై తిరుగుచు ప్రభుత్వమునకు లొంగకుండెను. శంకరలాల్ అట్టి స్వల్పవివాదమునకు అజితబాబును హత్యగావించునా యనియు, మరొకసారి ఎందులకు గావింపగూడదను తలంపుతో స్థిరత్వమునకు రాలేకుండెను. ఎటులయిన తన మార్గమున కడ్డురాకుండ శంకరలాల్‌ను తప్పింప ప్రయత్నించుచుండెను.

చీకటులు నల్గడల వ్యాపించెను. ఆకాశమున మినుకుమినుకు మనుచు తారలు తమ గ్రుడ్డివెలుఁగు నిచ్చుచుండెను. అట్టితఱి భాలీ గంజి మార్గమున ఒకవ్యక్తి వేగగమనమున బోవుచుండెను. కొలదిసే పటుల నడచి తటాలున ఆగెను. ఎదుటనుండి వచ్చెడి రక్షకభటుని గాంచి కాభోలు ప్రక్కనున్న సందునఁబడి పో మొదలిడెను. అబ్బా ! అతని నేత్రము లెంతటి తీక్షణములు. అటుల యాపదపాలుఁబడకుండ తప్పించుకొని కొంతవడికి తన గమ్యస్థానము జేరబోవుచుండెగాభోలు నడక గమనము తగ్గించెను. అప్పుడే పోలీసుఠాణానుండి టంగుటంగుమని

పహారాజవాను పం(డెండుగంటలు కొట్టెను. నగరమంతయు మాటు మణగెను. ఆ వ్యక్తి ఎవరని పాఠకుల మానసములు తొందరపడవచ్చు. ఆత డెవరు ? శంకరలాల్ ! ఎటులయిన మనోరమను ఆటనుండి గొం పోవు తలంపుతో ఆ నిశీధమున బయలుదేరెను. సౌధపు టుత్తరభాగ మందున్న పూపందిరినుండి మేడపై భాగముజేరి అందలి గదులనన్నిటిని పరీక్షించుచుండెను. నాలుగైదు గదుల వెదకెను గాని మనోరమ గాన్పింపలేదు. ఎట్టకేలకు ద్వారముచెంత నగ్నముగ మొలను ఖడ్గము ధరించి నిదురించెడి పహారాజవానుగల గది జేరెను. వెలుపల ద్వారము బంధింపబడెను. దారి కడ్డముగ సేవకుడు పరుండెను. అంత శంకరలాల్ జేబునుండి యొకసీసా సేవకునకి వాసనజూప వాడు తెలివిహీనుడై గాఢనిద్రజెందెను. మెల్లన వాని మొల తాళపుగుత్తెనుదీసి ద్వారము తెరచి గది ప్రవేశించెను. హాయిగ నిదురించుచున్న మనోరమాసుందర వదన మావిద్యుద్దీపకాంతియందు గాంచి పులకితశరీరుడయ్యెను. ఇపు డిక తన్నడ్డువా రెవ్వరని తలంచెను. ఎంతసేపు జూచినను తనివిదీరకున్న ఆమెను ప్రేమార కౌగిలించుకొన తలంచెను గాని అట్టి పనివలన ప్రమాద మని తొందరజెందు తన మానసము నూరటపరచి ఆమెనుగూడ నచే తను జేయ నొక్క దీనమగు మూల్గుమూల్గి కొలదిసేపటిలో స్మృతి తప్పెను. ప్రక్కగదియందే పరుండిన గోపీనాథ్ చేత పిస్టలుగొని పరు విడివచ్చెను. ఎదురుగ దృఢకాయుడు, కోపారుణితనేత్రుండునగు శంకర లాల్‌నుగాంచి వెంటనే పిస్టలు నుపయోగించ నది శంకరలాల్ చేయి గాయపరచెను. చేతనున్న సీసా క్రిందపడి పగిలెను. పాపము ! రివా ల్వరు అవసరములేదని శంకరలాల్ తే మరచెను. లొంగినవానివలె నటిం చుచు సమయమునకై వేచియుండెను. తను ఆతురతతో గోపీనాథ్ శంకరలాల్ మాట మరచి మనోరమవైపు తన దృక్కులబరప శంకర లాల్ హరిణముపై లంఘించు కేసరివలె గోపీనాథ్ పై బడి నతనిచేత

పిస్తలుపై కొట్టిన నది దూరమున బడెను. గోపీనాథ్ దానికై ప్రయత్నించెను కాని సమయముమీరాపెను. శంకరలాల్ నిర్దయుడై గోపీనాథ్‌పై ప్రేల్చిన పాప మతని నుదుట తగిలిన గుండుదెబ్బకు రుధిరం గార నేలకొరిగెను. శంకరలాల్ తన గాయముల లెక్కసేయక రుధిర మటుల గారుచున్నను నిక ఆలసించిన ఆశాభంగమగునని మనోరమను తన భుజముపై నిడికొనివచ్చిన మార్గము ననుసరించి శ్యామబజారు నందలి తన తావు జేరెను.

శంకరలాల్ అటుల తన గృహముజేరి మనోరమ నొక మెత్తని పాన్పుపై పరుండజేసి వేరొక మందు నామె నాసికారంధ్రములకడ నిడ కొలదిసేపటిలో కండ్లువిప్పి జూచెను. ఎదుట తలవని తలంపుగ శంకరలాల్‌నుగాంచి భయవిహ్వలయై నొక పెద్దకేకవైచి మూర్ఛజెందెను. అంత శంకరలాల్ ఆమెచెంతజేరి చల్లటినీటిచే ఆమె ముఖముపై కొలదిగ పోయుచు సేదదీర్చుచుండ కొలదిసేపటికి మనోరమ తెలివినొందెను. పూర్వము తాను నిదురించిన గదిగాదే? తన పరిసరమంతయు మారినట్లు గాంచెను. ఇంతలో శంకరలాల్ అటజేర పాన్పునుండి లేచి దూరమున బోయెను. ఇదియంతయు నీచుడగు శంకరలాల్ కార్యమని తలచి ఆతని నుద్దేశించి యిటుల పల్కెను.

"మూర్ఖుడా! నన్నిట్లు బలాత్కారమున గొనివచ్చుటలో నీయుద్దేశ్యమేమి?

'నాయుద్దేశ్యమా! నీవెఱుంగనిదేమున్నది.'

'పాపి! యింకను నీవెర్రిభ్రమలతోనే యుంటివా! అటులెన్నటికి జరుగదు. ఒంటరిగ సబలచేసి యిటగొనివచ్చి నిర్బంధమున నీయిచ్ఛ తీర్చుకొననెంచితివా?'

'ధర్మమో! అధర్మమో! నాకవియన్నియు తెలియదు. తుదిసారిగ వేడుచుంటిని! నాకోరిక నెరవేర్చుము'ని.

'తొలుతనే జెప్పితిగదా! నామేనప్రాణము లుండునంతదనుక నీకు నే వశమగుట లభించదు.'

'ఏమి! నీపొగరు. బ్రతిమాలుకొలది మితిమీరుచున్నావే? నీవా వశమువనిది. ఏది యిపు డెవ రడ్డువచ్చెదరో జూచెదగాక!' యని పై బడ నుంకించునంతలో మనోరమ నొక్కపెట్టున లెంపపై కొట్ట శంకర లాల్ తూలుచు దూరమునపడెను. అబలయగు స్త్రీ తన్నిట్లు అవమా నించుటచే శంకరలాల్‌నకు కోపమధికమయ్యెను. అంత రోషావేశమున ఉగ్రుడై చేత నొక కొరడాగొని తన యిచ్చవచ్చినటుల మనోరమను అతినిర్దయుడై గొట్టి నొకగదియందు బంధించెను.

'ఇక మూడుదినములు గడువొసంగుచున్నాను. ఈలోపల నీఅం గీకారము తెలుపవేని నీకు శరణ్యమీరివాల్వరే! ఎటుంగుదువా?' యని కావలివానితో ఆమెకు త్రాగుటకు కొలదిగ నీరు తప్ప యితర మేమియు యివ్వవలదని ఆజ్ఞాపించి వెడలిపోయెను.

---

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

### ని జ స ం గ తి.

గోపీనాధుడటుల శంకరలాల్‌చే గాయపడి శరీరమునుండి రుధి రముస్రవించి బాధచేమూల్గుచుండెను. అంత బయట నిద్రాపరవశుడైన సేవకుడు శంకరలాల్ మత్తుమందు మైకముతప్పెగాబోలు లోనుండి విన బడు దీనమగుమూల్గువిని ఆతురతతో అరుదెంచ రక్తమునబడి పొర్లాడు గోపీనాధునిగని ఘోషించు మిగిలినవారినందరలేపి త్వరితముగ నాతనిగాయ

ములకడిని కృత్రిమ నౌకవాన్పై పరుండజేసిరి. అంత మనోరమ పాన్పును శుభ్రము చేయుచుండగ ఏదియోచీటి క్రిందబడ సేవకుడదితీసి గోపీనాథునకిచ్చెను. అంతలో తేరుకొనిన గోపీనాథు డదితీసి చదువ నం దిట్లుండెను.

గోపీనాథ్ !

ఏమి నీ తెలివి తేటలు, నన్నుపట్టుకొన యినస్పెక్టరురాఘవన్ను నియమించితివి. అతడేగాక మరల రమేశుడను నూతనవ్యక్తినిగూడ నియమించితివి. మీరు నిదురించుగదిముందు పహారాయుంచితివి. ఇవియన్నియు ఏమైనవో నీకళ్ళారగాంచితివిగా ? మనోరమగతి ఏమయినదో తెలిసుకొంటివిగా ? నన్ను బంధించుటయన అంతసులభమని తలచితివి కాబోలు. నాపనినెరవేరినది. ఇక నీపత్తేదారు లెందరువచ్చినను చేసిన దేమి ? నీజీవితముపై ఆశగలదేని యీప్రయత్నములనుండి విరమించుకొనుము. లేనియెడల అజితబాబుగతియేనీకును పట్టును.

ఇట్లు,

నీహితాభిలాషి,

శ ం క ర లా ల్.

గోపీనాథు డీలేఖచదువుటతోడనే శంకరలాల్చే మనోరమ ఎట్టి బాధలకు గురియగుచున్నదోయని విచారపడజొచ్చెను. దుర్మార్గుడగు యీతనిచర్యలు తలంచినకొలంది కోపమధికమవజొచ్చెను. ఇంతలో రాఘవన్ అటకరుదెంచెను. ఏమిసంభవించెనోయని గోపీనాథునిజూచుటతోడనే నోటమాటరాక ఆయాసమున "గోపీనాథ్ గారూ ! ఈగాయము లేమని" ప్రశ్నించెను. అంత చేతనున్న లేఖ రాఘవన్నకివ్వ ఆతడదిచదివి చకితుడయ్యెను.

## ప లా య న ము.

రమేశబాబు యెన్నివిధముల ప్రయత్నించినను శంకరలాల్ జాడ తెలియకపోవుటచే నతడాందోళితచిత్తుడై యుండెను. రానురాను తుచ్ఛుడగు శంకరలాల్ పై ఆగ్రహ మెక్కువయ్యెను. ఎటులయిన వానిని తుద ముట్టింప కలకత్తానగరమందెల్లెడల వెదకుచుండెను. ఎట్టకేలకు తన అంతరంగిక భృత్యుడు, మిత్రుడగు దీక్షిచంద్ వలన శంకరలాల్ శ్యామబజారున నెం 59 వ గృహమునందు నివసించుచున్నటుల తెలుసుకొనెను. మనోరమకూడ యందే నిర్బంధితయై యుండునని తలంచెను. ఎప్పుడు మనోరమను వానిబాఱినుండి విముక్తనుచేతునాయని వేగిరపడజొచ్చెను.

రాత్రి పదిన్నరగంటలయింది. రమేశుడొకపిస్టలు తనయంగీయందు గుప్తపరచి బయలుదేరెను. ఒకగంటలో త్వరితగతి శంకరలాల్ గృహముజేరెను. పైకిజూడ అదిపాడుపడినగృహమువలెనుండెను. గృహమునందెక్కడ అలికిడిలేదు. ఆవీధియంతటికి చివురగ యీగృహమున్నది. సమీపమందలి వృక్షసముదాయములా నిశీథమున వికృతరూపములు దాల్చి భీతిగొల్పుచుండెను. మధ్యమధ్య చెట్లపై పక్షిపిల్లల కీచుకీచుమను ధ్వనితప్ప వేరొండేమియు విననగుటలేదు.

తనచుట్టుప్రక్కల నెవ్వరులేకుండజూచి రమేశుడు మెల్లగ చేత నున్నత్రాటిని పైకెగరవేయ నది యినుపకట్టడమునకు తగులుకొనెను. అంత ఆత్రాటిని నిచ్చెనసహాయమున రమేశుడు పైభాగముజేరెను. ఒకపరి తనపరిసరమింతకు ఆచీకటిలో తనకన్నులజూడ నలవరచుకొని గృహమంతయు వెదకెను. ఎచ్చటమనోరమ బంధింపబడినతావు గానరాలేదు. నిరుత్సాహమున యోజించుచుండ యెటనుండియో ఎవరో మూల్గుచున్నటుల వినవయ్యెను. మరల నేదైన ధ్వనివిననగునేమోయని వేచియుండెను, కొంతసేపటికి దేవిధముగ బాధకరమగుమూలుగు ఆక్రింద

ధ్వని వినవచ్చెను. రమేశునిమేను కంపించినది. రౌద్రపూరితుడయ్యెను. కాని వెంటనే కోపమునకిది సమయముగాదనితలచి ఆలసించినలాభము లేదని తన ఆయుధము సరిజేసుకొని ధ్వనివచ్చినవైపు నడచెను. అటుల కొన్నిగదులదాటిపోవ బయటబంధింపబడి సేవకునిచే పహరానివ్వబడు చుండుగదిగాంచెను. భటునిచేత తళతళ మెరయు ఆయుధముండెను. అందే మనోరమ బంధింపబడియుండునని తలచి రమేశుడు సమయమునకై వేచి యుండెను. ఇంతలో క్రిందనున్న గడియారము రెండుగంటలుకొట్టెను. తన యజమాని యీరాత్రికిక రాడనుధైర్యమున తనకిక నిదురవచ్చుచుండుటచే బంధింపబడిన మనోరమ పోజాలదనితలంచి అటనే నిద్రాపరవశుడయ్యెను.

భటుడు పరుండుట గాంచి రమేశుడిక తనపనికి గడంగెను. గుమ్మమునకు అడ్డముగ పరుండెను. రమేశుడంత నొకపరి గదియంతయు పరీక్షించి ఎటుదారిలేనందున కిటికీ యద్దమును తన జేబునందలి పనిముట్టు సహాయమునకోయుచుండెను. పాపమటుల కోయుటలో రమేశుని దురదృష్టమున నందలి కొంతముక్క చిటికి క్రిందబడి బ్రద్దలయి నొకవిధముగా ధ్వనియయ్యెను. ఆధ్వనికి సేవకుడదరిపడిలేచి జూడ రమేశబాబుని గాంచెను. సేవకుడు చేతనున్న బాకును రమేశునిపై ప్రయోగింప నుంకించునంతలో ఢాం ! మను శబ్దము వెలువడెను. వెనువెంటనే సేవకుడు విలవిల తన్నుకొనుచు నేలకొరిగెను. అటుపై తానుగావించిన మార్గము గుండ రమేశుడాగది ప్రవేశించి, యందు పొరలుచు, శల్యమైయున్న మనోరమను గాంచుటతోడనే రమేశబాబు కన్నులనుండి రెండు నీటి చుక్కలు క్రిందబడెను. ద్వారము తెరువ సేవకునివద్ద చెవిలేదు. అంతకు పూర్వమునుండి ఆహారలేమిచే మనోరమకు శరీరమంతయు కృశించెను. ఇంతలో ఏమితట్టెనో త్వరగక్రిందిభాగమున తానంతకు పూర్వము జూచిన శంకరలాల్ గదిచేరెను. అందలి శంకరలాల్ రాత్రి వచ్చునేమో

యని సిద్ధముగవుంచబడిన ఆహారపదార్థములు, మంచినీటిని తెచ్చి మనో రమకిచ్చెను. కొలదిసేపటికి మనోరమ సేదదేరెను. ఇక నట జాగుచేసిన ప్రమాదమని మనోరమ చేయిగొని మెల్లన మేడదిగుచుండెను. సోపాన పంక్తిపూర్తియయి హాలునందు కాలిడెనోలేదో వేధిద్వారము పెద్ద ధ్వనితో తెరువబడెను. అంత నొకవ్యక్తి లోనికివచ్చుటయు జరిగెను. ఆవ్యక్తి ఎవరోగాదు శంకరలాల్‌యే!

శంకరలాల్ మనోరమా రమేశుల నిరువుర గాంచుటతోడనే అంగీయందలి రివాల్వరు వెలుపలికిగీసి పైకెత్తెను. ఉగ్రుడై రివాల్వ రుప యోగించునంతలో రమేశుడతనిని నిరాయుధునిజేసెను. కోపమధికమవ శంకరలాల్ రమేశునిపై గలియబడెను. పోరాటమున శంకరలాల్ మిగుల గాయపడెను. గాయములనుండి రక్తమురాగా బాధ అధికమయ్యెను. అయినను మొండియగు శంకరలాల్ వాటిని లెక్కగొనక తనక్కజిత్తుల నెల్ల నుపయోగించుచు పోరాటము సల్పుచుండెను. రమేశుని రివాల్వ రెటులో నాపోరున క్రిందబడగొట్టి ఒకత్రుటిలో నేర్పునదాని చేబట్టెను. మాయోపాయముల నెరుగని రమేశుడు ధైర్యమున పోరాడుచుండినను నుదుటిపై తగిలిన గాయమునుండి రక్తము స్రవించ నీరసమెక్కువయ్యెను. అంత సమయముజూచి నీచుడు శంకరలాల్ రమేశుని రివాల్వరుచే శిరముపై కొట్ట పాపమదివరకే వీగిపోవుస్థితిలోనున్న ఆతడు స్మృతి విహీనుడై క్రిందపడెను. రమేశుడటుల పడుటగాంచి మనోరమ భయ భ్రాంతయై కెవ్వున నొక కేకవైచి మూర్ఛపడెను. శంకరలాల్ రమేశు నటవదలి మనోరమను తన భుజముపై నిడుకొని వెలుపలనున్న తన కారుపై నధిరోహించి అచ్చోటనుండి వెడలెను.

## ఖై దీ.

రమేశు శిరముపై చాలబలమగుగాయము తగిలెను. ఉదయ మగునంతవరకు ఆతనికి చైతన్యము కలుగలేదు. ఏడుగంటలయింది.

శరీరమంతయు నొప్పికలిగించుచుండ నెట్టులో లేచి జూచుసరికి వస్త్రము లన్నియు రక్తమయము. రమేశునకంత రాత్రి జరిగిన సంఘర్షణ జ్ఞప్తికి వచ్చెను. గాయములనుండి రక్తము కారుచుండుటగాంచి తన వస్త్రము నందలి కొంతభాగముచించి గాయమునకుకట్టుగట్టి తలుపుతెరువబోవ వెలుపల బంధింపబడియుండెను. అంత గవాక్షపు యద్దములు పగులగొట్టి యీవలకరుదెంచెను. రమేశుడు మెల్లగవీధిజేరి నొక రిక్షాపై తనలో తాను జరిగిన సంగతులకు చింతించుచు చేజిక్కిన మనోరమ తప్పిపోయె నని విచారపడజొచ్చెను.

రమేశుడు తన నివాసము జేరుసరికి అటనెవ్వరులేరు. రఘుదేవుని వలన అందరు రమేశుని వెదుకబోయిరని చెప్పెను. రమేశుడు తనగాయ ములకు వలయుమందువేసి కొంతవడి విశ్రాంతిగైకొనెను. అంతలోశంకర లాల్‌ను వెంబడించిన దీక్షిచంద్ వచ్చెను. దీక్షిచంద్ వలన శంకరలాల్ భవానీపురముచేరెనని తెలుసుకొనెను. రమేశుడు దీక్షిచంద్ చెప్పినసంగతి నిజమగుననియెంచి సంతృప్తహృదయుడై బయలుదేరెను. గతరేయి యంతయు కడునిడుమలకులోనై అలసటజెంది యుండుటచే నీరసముగ నుండెను. అయిననుసమయముమించిన మనోరమదక్కుట దుర్లభమని తలచెను. వెంటనే గోపీనాధునకు యీ వార్తయెల్ల తెలియపర్చెను. గోపీనాధుడు రమేశబాబు పడుచున్న శ్రమకు ఆశ్చర్యపడెను. రాఘవన్ కంటె కడుమేధావి, ప్రజ్ఞావంతుడని గ్రహించెను. ఎటులయిన సరియని బయలుదేర సంసిద్ధుడయ్యెను.

భవానిపురము జేరుసరికి పదకొండు గంటలయ్యెను. వెంట గోపీనాధుడు, సార్జెంటు స్టోనార్డ్ ఇనస్పెక్టర్ రంగనాధం కొంతమంది రక్షకభటవర్గమంతే కూడవచ్చిరి. దీక్షిచంద్ భవానీపురమందలి శంకరలాల్ సౌధముచెంతకు తీసుకబోయెను. గేటుద్వారముకడ పహరానిచ్చెడు భటులిరువురు మాత్ర ముండిరి. అంతరమేశబాబు వర్గమంతయు కాలినడ

కను మెల్లగ గృహము సమీపించిరి. మెల్లగ వారలచేరి రమేశబాబు 'శంకరలాల్ గారున్నారా?' యని ప్రశ్నింప ఎవరాయని వారు రమేశు నివైపు దిరుగ నంతలో యిరుప్రక్కల పొంచియున్న రక్షకభటులు వారల కాలుసేతులు బంధించి నోటమాటరాకుండ జేసిరి. దీప్తిచంద్ చూపిన గుప్తద్వారముగుండా అందరులోనికేగిరి. క్రిందిభాగమంతయు నిశ్శబ్దముగనుండెను. పైనుండి హాస్యప్రసంగములతోగూడిన సంభాషణ వినవచ్చెను. రమేశుడు హాలునందు ఎవరెచ్చటనుండవలెనో నియమించి శంకరలాల్ నాహ్వానింప పైభాగము జేరబోయెను. ఇంతలో మేడమెట్లపై పదధ్వనులు వినవచ్చెను. శంకరలాల్ పరివారసమేతుడై వచ్చుచుండెను. పాపము రాబోవుదానిని యెఱుగనిశంకరలాల్ ఆనాడు కడుసంతోషముగనుండెను. క్రిందికిదిగుటతోడనే హాలంతయు రివాల్వరు ప్రేలెడి ధ్వనులతో ప్రతిధ్వనింప మొదలిడెను. ఇరువైపువారలకు ఆ అంధకారమున ఘోరమగుసంఘటన జరిగెను. అంతయు హాహాకారములతో నుండెను. ఒక్కత్రుటిలో హాలంతయు శాంతివంతముజేయబడెను. శంకరలాల్ రక్షకభటవర్గముచే తామందరు చుట్టిముట్టిబడియుండుటగాంచెను. పోరాటమున రంగనాథ్ స్టోనార్డులు బలముగగాయపడిరి. గోపీనాథ్‌నకు చిన్నదెబ్బతగిలెను. పోరాటమున శంకరలాల్ ప్రేల్చినగుండు రమేశుని భుజముపైనను చేతిపై తగలరక్తము స్రవించదొడగెను. అయినను రమేశుడది లెక్కసేయక ధైర్యముతో బోరాడెను. రమేశుడు మూర్ఛనొందిన మనోరమను గదినుండి యీవలకు దెచ్చి సేవచేయుచుండ అదియె సమయమని శంకరలాల్ మొలనున్న బాకును రమేశునివీపుపై వేయబోవుచుండ గోపీనాథుడదిగాంచి తనపిస్టలుతో నతని నిరాయుధునిజేసెను. గోపీనాథ్ కొట్టినదెబ్బ కాళ్ళకుతగుల శంకరలాల్ యేమిచేయుటకు నశక్తుడయ్యెను. అటుపై శంకరలాల్ అతని మిగిలినయనుచరులు బంధీకృతులై పోలీసు ఠాణాకు గొంపోబడిరి. ఇంతలో డాక్టరు రోనాల్డుఇనస్పెక్టరు రంగనాథ్ సార్జెంటుస్టోనార్డుల గాయములకుకట్లుకట్టి వెడలిపోయెను.

మఱునాడు మధ్యాహ్నము 11 గంటలయ్యెను. కలకత్తాహైకోర్టు జనసమూహముచే క్రిక్కిరిసియుండెను. దారుణహంతకుడు చోరుడు నగు శంకరలాల్‌నజూడ అందరునరుదెంచిరి. తుదకు శంకరలాల్ న్యాయమూర్తిచే దోషియని నిశ్చయింపబడెను. అజితబాబుహత్య, మనోరమా అపహరణముక్రిందను నతనికి ఉరిశిక్షయు, ఆతని అనుచరులకు ఒక్కొక్కనికి రెండేండ్లు కఠినకారాగారవాసశిక్షయు విధింపబడెను.

పత్తేదారు రమేశబాబు ప్రభుత్వముచే గౌరవింపబడి రెండువేల రూప్యములు, సువర్ణపాత్రయు బహుమతిపొందెను.

గోపీనాథ్ మనోరమలిరువురు రమేశబాబు తమకొనరించిన సహాయమునకు వేనోళ్ళబొగడిరి.

---

## ఏడవ ప్రకరణము.

### పరిచయము.

శంకరలాల్ శిక్షానంతరము రమేశబాబు గోపీనాథ్ మనోరమల వద్ద సెలవుగైకొని చాలదినములగుటచే తనస్వగ్రామమునబయలుదేరెను. కలకత్తాకు చంద్రనగరము సుమారు పదునైదుమైళ్ళుండును. రమేశుడానాడు తనసైకిలుపై బయలుదేరుసరికి సాయంకాలము నాల్గుగంటలయ్యెను. త్వరితగతి స్వగృహముజేరుదమను తలంపున రమేశుడు వేగముగ త్రొక్కుచుండెను. కాని చీకటులప్పుడే నలుదిశలావరింపదొడగెను. అచ్చటికిక చంద్రనగరము మూడుమైళ్ళుండెను. రోడ్డుకిరుప్రక్కలనున్న పొదలూ, చెట్లు యిరువైపులమార్గముకప్పి ఆచీకటియందు వివిధాకారములతో నొప్పుచు భీతిగొల్పుచుండెను. బాట సరియయినదికాకపోవు

టచే ఆచీకటియందు కాలిడకనే మిగిలినదూరముబోన నిశ్చయించెను. అటుల రెండుఫర్లాంగులునడచునప్పటికి సమీపమున యెచ్చటనుండియో స్త్రీఆర్తధ్వని వినవచ్చెను. ఆక్షణముననే ఏదియోపడినట్లు చప్పుడయ్యెను. ఈరాత్రిసమయమున యీరోదన మెవరిదని రమేశుడు తనసైకిలు అట నిల్పి ఆయేడ్పు వినవచ్చినదెసకు మరలిపోసాగెను. పరిసరమంతయు తుప్పలు, పొదలు, మార్గమునకైనదికాదు. రమేశుడటుల బండ్లత్రోవ వెంబడి పోవుచు అరమైలుదాటునప్పటికి తనకు దూరమున దారికడ్డముగ యేదియోయున్నటుల గాంచెను. ఆ దెసనుండియే దీనమగుమూలుగు వినవచ్చుచుండెను. బండి సమీపించునంతలో నొకదీర్ఘకాయుడాపొద లంబడి అదృశ్యుడగుట గాంచెను. రమేశుడేతెంచి చూచుసరికి బండి తలక్రిందులయియుండ అందొకస్త్రీ గాయపడి కొనయూపిరితో మూల్గు చుండెను. ఆమెచీరకొంత ఆచోరునితో పెనుగులాటయందు చినిగెను. రమేశుడంత ఆమెను లేవదీసి గాయములుతుడిచి కట్టుకట్టెను.

ర—అమ్మా! మీరెవ్వరు? ఈచీకటియందు ఒంటరిగ ప్రయాణముసలుపనగునా?

స్త్రీ—నాయనా! నీవెవ్వరవో! సమయమునకు నాపాలిటిభగవంతునివలె వచ్చితివి. ధనముపోయినను ప్రాణముల గాపాడితివి. మాది యిచ్చటకు సమీపముననున్న రఘునాథపురము. మధ్యాహ్నము పండ్రెండుగంటలకు బయలుదేరితిని. త్వరగతీసుకబోవుదునని బండివాడు చెప్ప నట్లేయని బయలుదేరితిని. ఈప్రాంతముజేరుసరికి చీకటిపడ బండివాడు మెల్లగతోలుట మొదలిడెను. ఆదుర్మార్గుడు బండియందు నేనొంటరినగుటచేతను నగలుండుటచేతను అపహరింపదలచి యిటబండినాపి నిర్బంధింపమొదలిడెను. నాశక్తికొలది పెనుగులాడితిని కాని లాభము లేకపోగా గాయపడితిని. ఇంతలో నాకేకలువిని నీవువచ్చుట జూచె

గాబోలు నని తలంచుచున్నకొని వానిని చంపుప్రయత్నము మాని పారి పోయెను.

ర___ఎంత పనిజరిగినది. ఒంటరిగ యిట్టిప్రదేశముల ప్రయాణము సలుపరాదు. యిప్పుడు మీకేమియు భయములేదు. మీవెంటవచ్చి రఘునాథపురము జేర్చెద. భయపడకుడని ధైర్యము గొల్పెను.

అటుల రమేశు డామెను వెంటఁబెట్టుకొని ఒకగంటలో రఘునాథ పురమున ఆమెగృహము జేరెను. యిలుజేరి పిలువ పదునాల్గేండ్ల బాలిక యొకర్తు ద్వారము తెరువ యిరువురు లోనికిజనిరి.

మఱునాడుదయముననే రమేశుడు తన గ్రామముబోవు తలంపున తాను వెళ్ళుటకు అనుజ్ఞయిమ్మని కోరెను. అంత నామె తనకంతసహాయము చేసిన రమేశబాబును మరిరెండుదినము లుండవలసినదిగ ప్రార్థింప రమేశుడిక అటనే యుండవలసివచ్చెను. స్వగ్రామమువీడి చాలదినము లగుటచే యిక నటనుండక మరల వత్తునని చెప్పి మూఁడవనాడు చంద్ర నగరమునకు బయలుదేరెను.

## బధీకృత శాంత.

ఉదయముననే రమేశుడు తన కాలకృత్యములనెల్ల ముగించుకొని యిలుసేరెను. గతరాత్రి యంతయు నిద్దురలేమిచే కడు బడలియుండుటచే నీరసముగ నుండెను. రమేశునకు హంతకునివాగ్దానము ప్రకారము రాకుండుటకు హేతువేదియని తలపోయసాగెను. అత డపహరించిన ధనమును నెట గుప్తపరచెనో యనియు, ఎటులయిన వానిని సాధించి శిక్షార్హునిజేసి శాంతా, రమాదేవిని కాపాడవలెనని నిశ్చయించెను. ఇటుల ఆలోచనాపరంపర లాతని మనస్సును కలచివైచుచుండ శాంత కాఫీ బల్లపైనుంచి క్రీగంట నొక్కచూపుబరపి వెడలెను. రమేశుడు శాంతతో మాటాడ నుత్సాహము కలవాఁడైనను అది

సమయముగాదని వూరకుండెను. ఆమె సుందరవిగ్రహము తలంపునకు వచ్చునరికి రమేశునిమేను పులకిత యగుచుండును. బల్లపై కాఫీ నొక గ్రుక్కలో ముగించి వార్తాపత్రిక పఠనమున నిమగ్నుడయ్యెను. అంత శాంతతల్లి రమాదేవి యటజేరి 'రమేశబాబూ! నీదయవలన నిన్నటిరాత్రి సుఖముగ నిర్భయులమై నిద్రించితిమి. ఆనాడటుల జరిగినప్పటినుండియు మనసున కూరటలేదు. తుదకు మాట ధైర్యము జెప్పువారైన లేక తహతహలాడితిమి. మాశాంత నీవెప్పుడువత్తువని వేధించెడిది. బంధుగుల మైన కాని మాకై నీవు పడుశ్రమ చెప్పనలవికాదు. నీఋణమెటుల తీర్చగలనో' అని పల్కెను.

'అమ్మా! మీరంతగ పలుకనక్కరలేదు. నావలన యగునదేమి! అంతకు ఆసర్వేశ్వరుడే బాధ్యుడు' అనెను.

'ఏమో! మాయందు నీకంతకనికరము గలదు గనుకనే వార్త తెలిసినవెంటనే వచ్చితివి. ఏమటులుంటివి. రాత్రియంతయు నిదురబోలేదా?' యని రమేశుని వాడియున్న ముఖముజూచి ఆతురతతో ప్రశ్నించెను.

'ఏమియులేదు. మామూలుబడలికయే! ఏదియో కొంతవరకు మేలుకొంటిని.'

'ఎందులకుబాబూ! నీవుండ వారులెవ్వరు యింట కాలిడ సాహసింతురా?' అని లేనిధైర్యమున పల్కెను.

రమేశు డారాత్రిగూడ యెప్పటివలె అప్రమత్తుడై వేచియుండెను. ఎంతకు చోరునిజాడ గాన్పింపలేదు. అప్పుడే హాలునందలి గడియారము పన్నెండుకొట్టెను. రమేశు డొకపరి గృహముచుట్టివచ్చి ఓర్పుతో వేచియుండెను. అటుల సుమారు రెండుగంటలు గడచెను. రమేశుడు మరల యథాప్రకారము గృహముచుట్టి వచ్చుచుండ తన సమీపమున

ఏదియోగా పడుటగాంచి అదితీయ క్రిందికి వంగెను. వెంటనే ఎటునుండియో బలమగు దెబ్బ తలపై తగిలెను. ఎవరాయని వెనుదిరుగునంతలో ఆతని నోరు మూయబడెను. చేతనున్న రివాల్వరు అతుల పెనుగులాడుటలో క్రిందబడెను. అంతలో ఆనూతనుడు తనజేబునుం డేదియో దీసి రమేశునికి వాసనజూప తెలివితప్పి నేలకొరిగెను. పాపమెంతయో పట్టుదలతో చోరు నెటులయిన బట్టుకొన నిశ్చయమున రమేశు డిటులయ్యెను. అంత ఆవ్యక్తి తన పెద్దయడ్డంకి తొలగెనోయన వికటమందహాసము చిరుపెదవుల తాండవింప రమేశునటవదలి గృహముజొచ్చి తనపనికుపక్రమించెను. చేతనున్న టార్చిలైటు సహాయమున అందలి వస్తువులబట్టి అది రమేశుడుండుగదియని గ్రహించి మెలకువతో అంతయు వెదకెను. అందేమియు తనకు పనికివచ్చునవి లేనందున తన వస్తువునకై మఱియొకవైపుకు బయలుదేరెను. మెల్లగ హాలుప్రవేశించి వెదకుచు శాంత, ఆమె తల్లి నిదురించు గది గాంచెను. దేదీప్యమానముగ వెలుగు దీపకాంతియందు శాంత ముఖపద్మమెంతయు కడు శోభనీయమై యొప్పుచుండెను. మన నూతనవ్యక్తి ఆదృశ్యము గాంచగనే తన మనమున అనేక గాలిమేడలు కట్టజొచ్చెను. జాగుచేసిన ప్రమాదమని తనవద్దనున్న సన్నటి అంపమువంటి పనిముట్టుచే త్వరితగతి గదిలోనికి మార్గముజేసి ప్రవేశము గల్గించుకొనెను. తప్పనిసరిగ మత్తుమందుచే శాంతను చైతన్యహీనను గావించెను. సర్వమున తన దుర్మార్గత్వమో, వీరత్వమో పాపమా ముదుసలికిజూప కాబోలు నామెను లేపెను. అంత రమాదేవి యులికిపడి లేచిజూడ ఎదుట శాంతను భుజముపై నిడికొనియున్న భీకారాకారుని గాంచి భయవిహ్వాలయై రమేశునకై కేకలిడసాగెను. వెంటనే ఆవ్యక్తి లాభములేదని ఆమెనుగూడ మూర్ఛబొందునట్లుజేసి కాలుచేతుల బంధించి వచ్చినదారిని బయటనున్న శకటముపై నిడుకొని చనెను.

ఉదయ మయిదు గంటలు దాటెను. రమేశున కప్పుడే స్మృతి వచ్చుచుండె. కొలదిసేపటికి తెలివొంది జూడ తానింటిప్రాంగణమున నేల పై పడియుండుట తెలుసుకొని ఆశ్చర్యపడెను. అంతకుపూర్వము జర్గిన సంగతిమెల్లగ జ్ఞప్తికి తెచ్చుకొనెను. అటనుండి లేచి సింహద్వారముజేరి చూడ గృహద్వారములన్నియు తెరువబడియుండెను. చోరుడు తన కళ్ళ యందు దుమ్ముకొట్టి అతినేర్పుగ తనపని నెరవేర్చుకొనెనని యెంచి, శాంతారమాదేవిలకేమి సంభవించెనో యని లోనికి బోవుచుద్యుక్తు డయ్యెను. పాపము ! రమేశుని శిరముకు తగిలిన గాయమెంతయు బాధింప జొచ్చెను. ఆ వ్యక్తియిచ్చిన మందుచేగాబోలు నరములన్నియు పట్టువడుచుండెను. అటులనే నంచిసీటిచే గాయము కడిగి కట్టుకట్టెను. లోనికరిగి జూడ శాంతకాని ఆమెతల్లిగాని లేదు. ఆ దురంతకు డీరువుర బంధీలుగ దీసుకబోయెనా యని భయపడెను. అంతలో యెటనుండియో దీనమగు మూల్గు వినవచ్చెను. రమేశుడాధ్వని వినిబోవ నందొక గది యందు శాంతతల్లి కాలుచేతులు బంధింపబడి కొనయూపిరితో పడి యుండెను. తనవలెనే యీామె గూడ వానిదౌర్జన్యమునకు గురియయ్యె నని వగచెను. శాంత జాడలేదు. ఆమె బందీగ వానిచే గొంపోబడి యుండుననని తలచెను. రమేశుడాతురతతో శాంతతల్లి నాడి పరీక్షింప చైతన్యము తగ్గుచుండెను. తొందరగ తనవద్ద యెల్లప్పుడునుండు పెట్టె నుండి మంచి ఔషధము దీసి ప్రయోగించెనుగాని ఖాన్ యిచ్చిన మందు పనిచేసిగాబోలు ముదుసలియగు శాంతతల్లి విగతజీవిత యయ్యెను.

# ఎనిమిదవ ప్రకరణము.

## అమీర్ ఖాన్.

చోరశిఖామణి అమీర్ ఖాన్ బాల్యమునుండియు యీ వృత్తి యందు ఆరితేరినవాడు. తన నేర్పువలన కొలదిదినములనే కొంతమంది భృత్యుల జేరదీసి వారల నందరనొక సంఘముగ నేర్పరచెను. ఖాను ఆ గుంపున కంతయు సర్వాధికారి. ఆతని అనుచరులందరు ఖాను చెప్పి నటుల నడవవలసినదే. తుదకు ఆతనికై తమ ప్రాణములనైన నర్పింతురు. కొలది నెలల క్రిందటనే కలకత్తాయందలి సుప్రసిద్ధ వైద్యశిఖామణి ప్రసే నుబాబు హత్యాసందర్భమున ఖాన్ నకై ప్రభుత్వము వారెంతయు పట్టు కొన యత్నించుచుండిరి. కానియింతవరకు సఫలీకృతులవలేదు. అమీర్ ఖాన్ ప్రభుత్వము కళ్ళుగప్పివచ్చి యెప్పటికప్పుడె జిక్కక యథేచ్ఛతో తన దాడుల నిర్విఘ్నముగ సాగించుచుండెను.

అటులానాడు తన చేజిక్కిన కన్యాకుసుమమును అమీర్ ఖాను రామనగర మందుగల తన నివాసముజేర్చి నొకగదియందు బంధీకృత గావించెను. ఆమెకు వలయు నుపచారములకై రహీమ్ భార్య గులా మ్ను నియమించి తన పనిపై బోయెను.

అమీర్ ఖాన్ తన వుపయోగార్థమై పలుతావుల కొన్ని భవన ముల బాడుగకు గైకొని తనస్వాధీనమందుంచుకొనెను. వాటిలో నొకటగు రామనగరు సమీపమందలి 'వనవిహార్' రామనగరునందలి ప్రఫుల్లరాయ్ అను ధనికునిదాభవనము. గ్రామమునకు నాల్గుమైళ్ళ దూరమున నున్నది. రాయిపూర్వులు వాహ్యాళికై వాడెడివారు. యిపుడవసరము లేనందున వూరకవుండుట కంటె ఎంతయోకొంత అద్దె వచ్చుట మంచిదని ఖాన్ అడుగుంట తడవుగ బాడుగకుయిచెను. భవ

నము విశాలమైనదయి వాడకపోవుటచే, ధూళిదూసరములతో నిండి పాడుపడియుండెను. భవనముచుట్టు మైలుపొడవున చక్కటి మైదానము కలదు. ఆకాలమున నది యంతయు పుష్పవనోద్యానము. కాని యిప్పు డదియంతయు పొదలు, తుప్పలు, పెద్దపెద్దవృక్షసముదాయముతో నిండి యున్నది. రాజబాటనుండి చూడ అట భవనమున్నటులే తెలియదు. అమీర్‌ఖాన్ యీసంగతులెల్ల గ్రహించియే తన వుద్యమమున కనువైనదని దీసుకొనెను.

శాంతకు 'వనవిహార్' చేరిన చాలసేపటివరకు గాని స్పృహ రాలేదు. గులామ్ గావించిన వుపచర్యలవలన సాయంత్రము నాలుగు గంటలకు తెలివినొంది తన పరిసరములగాంచి నిశ్చేష్టయయ్యెను. తన స్వగృహముకాదు. తానొక చక్కటిపాన్పుపై పరుండెను. గదియంతయు కడుసుందరముగ నలంకరింపబడియుండెను. అంతలో తనతల్లి రక్షేశుల మాట జ్ఞప్తికిరాగ కన్నులనుండి నీరు బొటబొటగార ఏడువనొడగెను. దీనికంతయు ఆనీచుడే కారణమని తలచెను. ఆతనిపేరు తలచిన క్రోధ మధికమగుచుండెను. యిపుడె వానినెదుర్కొని వాని జంపుటయో, తాను జచ్చుటయో తేలవలెనని లేచెను. అప్పుడే మంచినీటికై బోయిన గులామ్ అట కరుదెంచ ఆమెనుగాంచి శాంత కోపారుణితనేత్రయై, 'నీవెవరవు? నే నిట నుండుటకు కారణమేమి? నీయజమానిపేరేమి? చెప్పెదవా లేదా' యని ప్రశ్నించెను. అంత గులామ్ శాంతను మంచి మాటలచే శాంతింపజేసి ఆమెతో యిటుల పల్కెను. 'నీవెటులవచ్చి తివో నీకు తెలియదు. తీసుకొని రాబడినప్పుడు నీకు స్పృహలేదు. మానాయకుడు శౌర్యశాలియగు అమీర్‌ఖాన్. నేను ఖాన్ ఆంతరంగిక మిత్రుడగు రహీమ్‌ఖాన్ భార్యను గులామ్‌ను.'

'ఏమి అమీర్‌ఖాన్! ఆహా! ఎట్టి దుర్జనునిచేతిలో పడితిని. నీవెంచుల కేటు వచ్చితివి.'

'ఖాన్‌చే నీసపర్యలకై నియమింపబడితిని.'

'ఇంతకు పూర్వము యాధన మపహరించిన మూర్ఖుడేనా యీ అమీర్‌ఖాన్ ?'

'నీకిప్పు డవియన్నియు అనవసరము. కొలదిసేపటిలో అన్నియు తెలుసుకొనగలవు. జాగ్రత్తగానుండుము. ఆత డరుదెంచు వేళ సమీపించు చున్నది.'

'అటులనా ? రానిమ్ము ! అప్పుడేచూపెద నా సామర్థ్యము. తగిన ప్రతీకారము గావించెదనని' రోషమున పల్కెను.

శాంత రౌద్రావంతమగు ముఖముగాంచి గులామ్ మంచిమాట లచే తన నాయకునిపై ఆమె మానసము త్రిప్పజూచి యిటులపల్కెను.

'శాంత ఏమి ఆలోచించుచుంటివి. మానాయకుడవిన అంత తేలికగ యుండెనా ! శౌర్యశాలి, వీరతేజోవంతుడు మహామ్మదీయున కుండెడి సలక్షణములు కలవాడు. చేత ఖడ్గముగొనిన ఎందరినైన నొక్క పెట్టున మట్టుబెట్టును. ఎందుకటుల సందేహింతువు. చిన్నదానవు, తెలి యక మూర్ఖురాలవలె సంచరించక సుఖముగ ఆతనిచేపట్టి మాకందరకు నాయకురాలువగుము. నిన్నరచేతులలోపెట్టి లాలించును. పరుషభావము మాని ఆతనికి అనువుగ ప్రవర్తింపుము. ఆతడరుదెంచు సమయమాసన్న మైనది. నాపల్కు లాలించి నే జెప్పినటుల నడచి సుఖింపుమ'ని హెచ్చ రించెను.

'అమీర్‌ఖాన్ ! ప్రసేనుబాబు హంతకుడా ! పేరు వినునప్పటికి శాంత హృదయము కృంగెను. ఖాన్ యనిన చోరశిఖామణి, ఆరితేరిన చేయి; దారుణ హంతకుడు, యిక వీనిచేతులనుండి ప్రాణములతో బయటపడుట కలలోనివార్తయని యెంచి రానున్నకష్టముల నెదుర్కొన సంసిద్ధయయ్యెను. అంతలో తనతల్లి రమేశులసంగతి జ్ఞప్తికిరాగ తనకై వారెట్టి యిడుముల పాలయ్యారో యని చింతిలెను.

గులామ్ పొరపాటున తన యజమానిపేరు శాంతకు తెలియపర్చి నందులకు భయపడెనుగాని దానివలన నష్టమేమని తలచి ఊరకుండెను. ఇంతలో బయట కారు ఆగినశబ్దమగుటచే త్రుళ్ళిపడి 'అడిగో! హుజూర్ ఖాన్ వచ్చినా'డని తొందరగ ఆతనికి వలయు పరికరముల గూర్చ క్రిందకుబోయెను. గులామ్ హాలునందు ఖాన్‌కు వలయు బ్రాంది, బిస్కత్తులు, రొట్టె, ద్రాక్షపానీయము మొదలగునవన్నియు నమర్చి ద్వారము తెరువబోయెను. అమీర్‌ఖాన్ భవనముప్రవేశించి హాలునందు ద్రాక్షరసము సేవించుచు శాంతవిషయమై ప్రశ్నింప దొడగెను.

గు—ఆమె ఆరోగ్యముగనే యున్నది. కాని ఆమె ప్రవర్తన విపరీతముగ నుండునా!

అ—అవును! మొదట అటులనే యుండును. గులామ్! నే నామెను అధికముగ ప్రేమించితిని. నేనే ప్రయత్నించి నాకోరిక నెరవేర్చు కొందును.

గు—హుజూర్! చిత్తము. గొప్ప అదృష్టవంతులు. లేనిచో యిట్టి సౌందర్యవతి లభించదు. తమరు నేర్పున సాంతముతో వ్యవహరించిన ఆమె తప్పక తమ కనుకూలయగును.

అమీర్‌ఖాన్ చేతనున్న గ్లాసు ఖాళీచేసి శాంతగదిజేరి చేతితో త్రోయ తలుపులు తెరువబడెను. అమీర్ శాంత పరుండునని తలచెను కాని ఆమె అప్పుడే స్నానమాచరించి గులామ్ యిచ్చిన దుస్తుల ధరించుచు ఆతనినిగాంచి తనదుస్తుల సవరించి ప్రక్కగ తొలగెను. అమీర్ కామాతురుడై 'శాంతా' యనుచు సమీపింపబోయెను గాని ఆమె నేత్రద్వయమును గాంచగనే చకితుడై నిలబడెను.

అంత శాంత ఉగ్రనారీమూర్తియై "నీవిటప్రవేశించుటకేమి అర్హ తగలదు? పోమ్మావలకు" అని కఠినముగ పల్కెను.

"అట్టులనా ? ఇది నాభవనమని యెఱుంగవా ? మకరందపముగొన ప్రీతితో వ్రాలెడు తేనెటీగవలె నాప్రియతమమగు వస్తువునకై నేనిట ప్రవేశించుట నేరమని తలంచను. శాంతా ! నేడేల అంతఆగ్రహమచిత్తవైతివి ? నీకోపమువలన నీముఖబింబము మరింతఅందమిచ్చుచున్నది. ఏదీ నీ..."

"చాలు ! నోరుమూయుము. ఇక నీతుచ్ఛపుసంగతులుపల్కెద వేని" యనుచు కాలిజోడునకై ప్రయత్నించెను గాని లేదు.

'ఏమి ! అటులపలుక నీకునోరెట్లాడును. నీకై యెంతశ్రమజెందు చుంటినో ! రమ్ము సందేహమేల ననుగూడి నారాణివై సౌఖ్యమనుభ వింపు'మనుచు పశుప్రాయుడై సమీపించుచుండెను.

అంతకంతకు శాంత వెనకకు జరుగుచుండెను. చేత నాయుధము లేదు. ఖాన్ జూడ వ్యాఘ్రమువలె మీాదికివచ్చుచుండెను. ఇంతలో ప్రక్కనున్న గాజునీటిపాత్రచేతగొని 'చూచితివా ! దీనిచే నీతల వ్రయ్యలుజేసెద. ఇకనొకయడుగైన ముందిడినచో నీప్రాణములు దక్కవ'ని గంభీరముగపల్కెను.

ఖాన్ ఆమెతలచినంత జేయుననియెంచి వెనుకకుతగ్గి తనధోరణి మార్చి యిటుపల్కెను. 'శాంతా ! ఎంతచెప్పిన వినునటుల లేదే ! నీపిచ్చి చేష్టలమానుము.

'నీవుగావించినపనికి ప్రతీకారముచేయవలదా ! ముందుగ నీఘాతుకకృత్యమునకు హేతువుచెప్పుము.'

'నిన్నిటకుగొనివచ్చుటకు కారణమా ? ఎరుగనిదేమున్నది. పత్తేదారురమేశబాబునుండి నిన్నువిడదీసి నామానసరాజ్యమునకు అధికారిణిగజేయుటయే. రమేశునిరప్పించి నన్నుబట్టుకొన ప్రయత్నించితివిగా ! ఇపుడెవరు సహాయపడుదురో జూచెదగాక.'

'తొందరపడకుము. నీక్రూరకృత్యములకు అంత్యకాల మాసన్నమయినది. లేనిచో నీకిట్టిబుద్ధిపుట్టదు. రమేశుడెటులయిన నీజాడలరసి నిన్ను బంధింపకతప్పడు.'

'ఇంకెక్కడి రమేశుడు. ఇప్పటికి రహీమునిచే బంధింపబడి యేకూపమునన్నో ప్రమగ్గుచుండును. ఊరక అడియాసలకు లోనగుటమానుము. నన్ను పొంది సకలసౌఖ్యములనుభవింపు'మని సగర్వముగ బల్కెను.

'ఏమి అంతసాహసమా ? అటులయిన యిదిగో యిప్పుడే నీదౌష్ట్యములకు ఫలమనుచు 'చేతనున్న సీసా లేనిబలము తెచ్చుకొని అమీర్ ఖాన్ శిరముపై గురిజూచి విసరెను. ఖాన్ నేర్పున ప్రక్కకు తప్పించుకొనెను. అంత సీసా వెనుకనున్న గోడకుతగిలి ముక్కలయ్యెను. గదియంతయు గాజుముక్కలే ! ఇదివరకే లోలోన క్రోధపరవశుడై యున్నఖాన్ తోకత్రొక్కినత్రాచువలె శాంతపై లంఘించి ఆమెను పాన్పుపై పడద్రోసి తన చేతులతో ఆమెమెడగ్రుచ్చిపట్టి బాధింపజొచ్చెను. పాపము ! నిస్సహాయ శాంతయేమిచేయగలదు. అంతకంతకు గొంతుకయందు గ్రుచ్చుకొనిన గాయములనుండి రక్తమువచ్చుచుండెను. బలిష్ఠుడగుఖాన్ పట్టునుండి అబలయగుశాంత విదలించుకొనలేక రానురాను స్మృతివిహీనయైపడెను. శాంత అటులపడిపోవుటగాంచి యిక ఆమె తనస్వాధీనమయ్యెననుతలంపుతో ఖాన్ ఒకపెద్దదెయ్యపుకేకవేసెను. వెర్రిఆనందము పట్టజాలకుండెను. కాని అంతలోనే అతని ఆనందమంతయు తటాలున గదితలుపులు తెరువబడుటతోడనే భగ్నమయ్యెను. గులామ్ ఆకేకవిని లోపలయేమి సంభవించెనోయని ఆతురతతో ఆటకరుదెంచెను. గులామ్ ప్రవేశించుట జూడగనే ఖాన్ శాంతపై పట్టువదలి మూర్ఛపడియున్న నామెను అటులే చూచుచు నిలబడెను.

గులామ్ రక్తసిక్తయైపడియున్న శాంతనుగాంచి విభ్రమజెంది 'హుజూర్ ! ఏమిచేసితిరి ! యీరక్తమేమి'అని ప్రశ్నించెను.

అంతఖాన్ యెప్పటిస్థితిపొంది తానుగావించిన తెలివిమాలినపనికి సిగ్గుపడుచు ముఖమువంచి 'గులామ్ ! ఏమియులేదు !'అనెను.

'ఏమియు లేదా? అటులనుటలో అర్థమేమి? పాన్పుపై పడియున్న ఆయువతిని చూచితిరా!'

'ఆమెమూర్ఛపొందినది. అంతకన్న వేరేమియుహానిలేదు. ఆమెను ఆరోగ్యవతిగజేయుమని నీకువచలుచున్నా'ననుచు గదిద్వారము సమీపించెను.

ఇంతలో గులామ్ శాంతను సమీపించి గాయములజూచి "క్రోవము" హుజూర్! నీశరీరము నీవే మరచినట్లున్నదే! స్త్రీలను లాలించుటయిదియా. ప్రేయసిని తనకు ప్రేమవశముగుటకు ప్రియుడాచరింపవలసినవిధాన మిదియా! ఏమి నీపశుత్వము యీ కృత్యములచే నిన్ను ప్రేమించుటకు మారుగ మరింతగ నిరసించును.' అని మొగము వాచునట్లు జివాట్లుపెట్టెను.

"గులామ్! ఏమి నీవాచాలత్వము. చాలించుము. తగిన సమయము వచ్చును. త్వరలోనే ఆమె నాపాదాక్రాంతయగునట్లు చేసెద. అప్పుడు చూచెదవుగాక నానేర్పు! ఏల అటులపల్కెద" వనుచు తన క్రూరచేష్టల తానె మెచ్చుకొనుచు అటనుండి వెడలెను.

## తొమ్మిదవ ప్రకరణము.

### రహీమ్

రహీమ్ ఎంతమంచిపేరు. పేరుకుతగినట్లు యీతని సమర్థతకూడ గొప్పదే! ఖాన్ ముఖ్య అనుచరులలో రహీమ్ మొదటివాడు. ఆతనికై తన ప్రాణములనైన అర్పింప సాహసించును. ఖాన్ గూడ లెంతటిముఖ్య విషయమైనను రహీమ్‌తో ఆలోచించనిదే చేయడు.

అది కృష్ణపక్షము. సుమారు రాత్రి పదిగంటలగును. నాయకుని ఖాన్ ఆజ్ఞాప్రకారము శరవేగమున తన శకటముపై రఘునాథపురము

బోవుచుండెను. ఆతని మానసము పలు ఆలోచనలకు తావయ్యెను. ఖాక్ చెప్పినచొప్పున శాంతయింట గుప్త ధనస్థాను కాక రమేశుని గూడ బంధించి తేవలయునని యుద్దేశించెను.

ఇనస్పెక్టరు రాఘవన్‌నకు పత్తేదారు రమేశబాబు ప్రతిభశాలి యగుటతోడనే స్నేహమెక్కుడయ్యెను. ఈవిషయము రమేశబాబు ప్రవర్తనయేమియు బోధపడుటలేదు. ఎంతశక్తివంచనలేకుండ ప్రయత్నించి నను తన కంటె ముందడుగు వేయుచునే యుండెను. డిటెక్టివ్రలు ప్రభు త్వోద్యోగులకంటె యింత తెలివితేటలెక్కుడవని ఆశ్చర్య సంభ్రమము లకు లోనగును. అందులో రమేశబాబు చర్యలన్నియు విపరీతముగ నుండెను. రమేశుని పనినేర్పు, కీర్తి గాంచి లోలోన యీర్ష్య చెందు చున్నను తప్పనిసరి యగుటచే ఆతనితో గలసి పరిశోధనలందు పాల్గొన వలసివచ్చె. మరల రఘునాథపురము బోవుటెందులకో యింతకాల మట నుండుటకు హేతువేమియో రాఘవన్‌నకు బోధపడలేదు.

నా జేలనో రమేశబాబు అసిస్టెంటు రవీంద్రు డింకను నిద్రింప లేదు. తొందరగ రమేశబాబు చెప్పిన చొప్పున తన వేషము మార్చు చుండెను ఇంతలో రమేశబాబుఅటకరుదెంచిరవీంద్రునుద్దేశించి రవీంద్రా! ప్రయాణమునకు సంసిద్ధుడవైతివా ? అన్నియు సిద్ధపరుచుట పూర్తి యయినదా ! అని ప్రశ్నించెను.

"బాబూజీ ! అన్నియు సిద్ధపరచితిని."

'ఏమి ! బాగుగ నీ రూపము మార్చితివే ! నిన్ను నేనే నమ్మ లేకుంటిని ' అనెను.

'రమేశ్ జీ ! మనగృహయజమాని అనుమానించడుగదా ? '

'మనల నెవ్వరు గుర్తింపరు. త్వరగబయలుదేరవలయు రమ్ము ' అని పలుక రవీంద్రుడు తన అంగీయందు రివాల్వరు జాగ్రత్తపరచి బయ లుదేరెను.

ఆకాశమున నక్షత్రములు మినుకు మినుకు మనుచు తమ గ్రుడ్డి వెన్నెల నిచ్చుచుండెను. అంతలో పెనుభూతమువలె మేఘసమూహములు గగనమంతయు కప్పిపుచ్చ లోకమంతయు అంధకారబంధుర మయ్యెను. అటుల బయలుదేరిన రమేశ రవీంద్రు లిరువురు త్వరితగతి శాంతిగృహము సమీపించు నప్పటికి పదునొకండు గంటలు దాటెను. గృహము నలువైపుల విశాలమగు ప్రదేశము. అందు చెట్లు చేమలు దట్టముగయుండి పుష్పలతాదులచే యింపు గొల్పుచుండెను. ఆ కటిక చీకటిలో రమేశరవీంద్రు లిరువురు ఒకరివెనుక నొకరు సవ్వడిచేయక అతిజాగరూకతతో నడచుచుండిరి. అటుల కొలది దూరమునడచిరి. రవీంద్రు డేలనో తలయెత్తి ముందుకు జూచెను. ఎదుట నడచు రమేశ బాబు లేడు. ఆ అంధకారమున సమీపమందలి వస్తువే కాన్పించుటలేదు. రవీంద్రుడు అనుమానాస్పదమై తన కట్టెదుటయున్న వ్యక్తి అంతలో మాయమగుటజూడ వింతగదోచెను. రమేశునకై వెదుక ప్రయత్నించు నంతలో తన కుడివైపున సమీపమునుండి ఏదియో మాటలసవ్వడి వినవచ్చెను. ఎవరో రోషమున 'దెబ్బకు హతుడగునట్లు కొట్టుము. ఇంకను చూచెదవేల. సవ్వడిచేయక నేనిటనుండి జూచుచుండెద! నీకేమియు భయములేద'నుచు పల్కదొడగెను. రవీంద్రున కవి చాల సమీపమునుండి పల్కిన మాటలవలెనుండెను. ఒకవేళ రమేశ బాబు చలోక్తికై తన్ను పరీక్షింప అటుల పల్కుచుండెనాయని తలంచెను. అట్టిసమయముల రమేశుడెన్నటికి అటుల అవివేకముగ ప్రవర్తించడని దృఢనిశ్చయు డయ్యెను. మరుక్షణముననే ఆవ్యక్తి రమేశబాబు కాదని గ్రహించెను. ఆవ్యక్తి తటాలున వేసినటార్చిలైటు నీడను అతని శరీరాకృతిని గుర్తింపగల్గెను. అనూతనుడు, స్థూలకాయుడు, పొడగరి, పిల్లిగడ్డము, వానియుడుపులబట్టి యొక మహమ్మదీయునిగ తెలుసు కొనెను. వెంటనే తన రివాల్వరునకై అంగియందు చేయునిడుచుండ

'ఆగుము. ప్రాణములపై ఆశ గలదేని నీప్రయత్నము చాలించు' మనుచు ఆనూతనుడు గద్దించిపల్కెను. రవీంద్రుడిక చేయునదేమున్నది. దగ్గర రమేశబాబులేడు. తప్పనిసరిగ వానికి వశుడయినట్లు సూచనగ రెండు చేతులుపైకెత్తి అటులే నిలబడెను. కాని రవీంద్రుని మానస మానీచునికి వశమగుటకు సహించుటలేదు. మొండిధైర్యమున మరొకమారు తన చేయి అంగీయందు పోనివ్వ ప్రయత్నించుచుండ ఆవ్యక్తి రవీంద్రునిపై లైటు పరిపూర్తిగప్రసరింపజేసి రవీంద్రా! నీటక్కరిపనుల కట్టిపెట్టుము. లేనిచో యీక్షణముననే నీశిరము వేయిముక్కలగుననుచు రివాల్వరు చేతగొని ప్రేల్చుటకు సిద్ధముగ నుండెను. రవీంద్రుడు తనప్రయత్నము మానలేదు. నూతనుడు గుండ్లు దట్టించుచుండెను. పాపము రవీంద్రుని జీవితము నిముషములలో నున్నది. ఎంతటిచేతకానివాడైనను తొమ్మిది గజముల దూరమున నున్నవానిని గొట్టలేడా? ఆతడొదిలినగుండ్లు యిప్పటికి రవీంద్రునిశిరము వ్రయ్యలుజేయ ఆతనిశిర మెటనో యెగిరి యుండెడిది. కాని అట్టిఘోరము జరగలేదు. అరివాల్వరు ప్రేలుటకు ముందుగ ఒక విచిత్రసంఘటన జరిగెను. రవీంద్రు డది గుర్తించి యుండలేదు. కమ్మరిసాలయందు వినబడు సమ్మెటదెబ్బయట్లు 'ధన్' మనుచు ఆనూతనుని శిరముపై నొక పిడిగ్రుద్దు తగిలెను. అటుల జరిగిన మరుక్షణముననే ఆతనిచేతనున్న రివాల్వరు దూరమున బడుటయు ఆతడు మొదలునరికిన వృక్షమువలె అటునిటు వూగుచు స్మృతిహీనుడై క్రిందికి పడుచుండ ఏదియో 'దిమ్మని' తలిగినట్లు శబ్దమయ్యెను.

రవీంద్రుడిటు తన్ను ఆపదనుండి రక్షించిన వారెవరాయని ఆలోచించుచు ప్రక్కను పడియున్న హంతకుని టార్చివెలుతురున జూచుచు చేష్టలుదక్కి అట్లే నిలబడెను. ఇంతలో సమీపమునుండి పడియున్న నూతనవ్యక్తి ముఖముపై మరియొకలైటు మెరిసెను. రవీంద్రుడులికిపడ వెనుదిరిగిజూడ తనయజమాని పత్తేదారు రమేశబాబు.

## మ ర్మ ము.

'రమేశ్ జీ ! మీరా ?

'అవును ! ఏమట్లు ఆశ్చర్యముగ జూచెదవు. క్షేమముగనుంటిరా! ఆగుండు నీకు తగులలేదుగదా !'

'తగులలేదు ! నాశరీరమునైన తాకలేదు.'

'సర్వేశ్వరుడు దయామయుడు ! ఆలస్యమైనదో కష్టమయ్యెడిదే!

'బాబూ ! సమయమునకు మీరెటుల రాగల్గితిరి ! వింతగ నున్న దే !'

'రవీంద్రా ! నేనాతనికొక గజముదూరముననుంటిని. మధ్యనున్న పొదయే అడ్డు. ఆతడు నన్ను చూడలేదు. మొదట చేత రివాల్వరు దాల్చి అటు నిటు పచార్లుచేయు నాతనిని యీచీకటిలో గాంచగల్గితిని. అందులకే నిన్ను వదలి వెళ్ళితిని. నేనాతనిని గుర్తించి వెంబడించకపోయి నచో నిన్నటుల రక్షింపకపోవుటయేగాక మన యిరువురి ప్రాణము లీపాటికి వేరొకలోకము జేరెడివి. అయినదేదో అయినది. మంచియే జరిగినది. రమ్ము ! ఆతడెవరో చూతము. రమేశుడటుల హంతకునిజేరి టార్చివెలుతురుకు వానిపై ప్రసరింపజేసెను. రవీంద్రుడు తలచినట్లు ఏనుగువలె కళేబరముగల్గి స్మృతిహీనుడై పడియున్న వాని జూచిరి. ఆవ్యక్తి దీర్ఘకాయుడు, మంచిదుస్తుల ధరించెను. చూపరులకు ఆతని ముఖమునుబట్టి క్రూరస్వభావునివలె నుండెను. పొడుగాటికాలుసేతులు, కడుపెరిగిన ఉదరముగల్గి చూపరులకు యించుక భయము గొల్పు చుండెను.

'రవీంద్రా ! యీతడెవరో తనపొట్టకై ననుచేసి పాటుపడు సోమరి వలె నున్నాడే ?'

'నే ననుకొన్నటులే జరిగినది.' అనుచు రవీంద్రుడు ఆవ్యక్తికి దగ్గరగదృష్టి నిగిడ్చిచూడ శిరమునుండి వాడటుల తూలుచు పడుటలో

ప్రక్కనున్న చెట్టుమోడువలన తగిలినదెబ్బచే రక్తము స్రవించుటగాంచి 'బాబూ! ఎటుల స్రవించుచున్నదో' యనెను.

'అవును. నేకొట్టినదెబ్బవల్లగాదు. ఆత డామోడుపై పడుటచే అట్టిగాయము కల్గినది. అబ్బా! నుదుట కండ్లకుచాల సమీపమున తగిలినదే! రవీంద్రా మందుల నిటు తెమ్ము. గాయముకడిగి కట్టు కట్టెదము.

రవీంద్రు డాతురతతో 'బాబూజీ! అధికారుల కీవిషయమై వార్త నంపలేదేమ'ని ఆశ్చర్యమున పల్కెను.

'రవీంద్రా! యిపుడవి యన్నియు చెప్ప తీరికలేదు. ముందుగ ఆతనిదుస్తులుమార్చి జాగ్రత్త పరుపుము. జేబులన్నిటిని వెదకుము. మన కనుకూలించు వస్తువులేమైన లభించునేమో'

రవీంద్రుడంత 'యివిగో!' యనుచు జేబునుండి పిస్టలు, కొన్ని కాగితపుముక్కలు, ఒక కవరు, టార్చిలైటు వెలుపలికిదీసెను.

'ఏమి? కాగితములా? ఆకవరేమి?'

'ఇదిగో! రవీంద్రా! కావలసిన ముఖ్యవస్తువు లభించినది. బహుశః యిదియె గుప్తధనపుప్లాను. అద్ది సీలుదీసి జూచెను. అది శాంత గృహమునందలి ధనము దాచిన ప్రదేశముచూపు ప్లాను. రమేశుని ఆశ్చర్యమునకు మేరలేదు. అందు అన్నియు గుర్తింపబడియుండెను. దీనికొరకే యీతడు నియమింపబడెను. యీతడెవరో తెలుసునా! రహీమ్! చూచితివా యీతనిపేరగల యీలేఖ' అనుచుండ డాక్టరు వచ్చిన ధ్వనివిని నాకాగితములు జాగ్రత్తపరచి ఆయన నాహ్వానింప బోయెను.

రమేశుడు, డాక్టరు, రహీమ్ గాయముగురించి తీవ్రముగా ఆలోచించుచుండిరి. డాక్టరు పరీక్షించి చాలబలమైనగాయము తగిలినదనియు, మూదిగనున్న ఆమోడు నుదుట లోతుగ దిగుటచే మెదడున కపాయమని

చెప్పెను. అందుచే జ్ఞాపకశక్తి క్షీణించుట, మతిచెడుటగాని కల్గునని ఆతడు తెలివినొందుటకు రెండుమూడుదినములు పట్టునని చెప్పి కొన్ని ఔషధములనిచ్చి తనదారిని వెడలెను.

కాని అది లేఖయందలి కొంతభాగమే. మిగిలినభాగము చినిగినది. చూడుమని రవీంద్రున కిచ్చెను.

రవీంద్రుడదిపుచ్చుకొని చదువదొడంగెను. అందిటులుండెను.

రహీమ్ !

నేనెచ్చటకేగితినో నీవు తెలుసుకొనగల్గితివన్నమాట. నేను దానిని కనుగొనగల్గుదునని దృఢనమ్మకములేదు. నీవు వెదకుచున్నావే ఆతడు మనల నొకసారిమోసగించినాడు. ఆతడట్టివాడయినను తప్పక ఆకార్యమాతడే.........

చదువుటముగించి రవీంద్రుడు 'బాబూ! ఎవరివద్దనుండి వ్రాయబడెనో తెలియలేదు' అనెను.

'ఇంకను గ్రహింపలేదా ! ఆలేఖకుడు వీరలనాయకుడే !'

'నిజముగ?'

'చూడలేదా? ఆలేఖ రహీమ్‌వంటివాడువ్రాసినదికాదు. పదములు సరళి తెలియుటలేదా !'

'అవును. ఆతడెవరో మంచి విద్యావంతుడువలెనున్నాడు.'

'ఈకవరుపైనున్నవిలాసముబట్టి యీరాత్రియే సంగతులు తెలుసుకొనెద. అప్పుడన్నియు విశదమగును. ఈతనికనిపెట్టియుండి స్పృహజెందినపిదప ఆతడేదైనపల్కును. జాగ్రతగ నోటుజేసియుంచుము.'

'ఆతడేదైనచెప్పునా? డాక్టరు రెండుమూడుదినములవరకు లేవడనిపల్కెనుకదా?'

---

## ప ది య వ ప్ర క ర ణ ము.

### వి మో చ న ము.

రమేశబాబు అటుల రవీంద్రునిపేడి స్టేషన్ జేరుసరికి మెయిల్ వచ్చి యుండెను. తాను సమయమునకే వచ్చితిననిసంతసించెను. బండికదలెను. రమేశుడొక మొదటితరగతిపెట్టెయందు సుఖాసీనుడయ్యెను.

రమేశుడంతవరకుజరిగిన విషయములనెల్ల తలంచుచు ఆలోచనా నిమగ్నుడయ్యెను. ఆరాత్రి తాముబయలుదేరి వెళ్ళినందుకు వృథాయవ లేదని సంతసించెను. రహీమ్‌వద్ద దొరకినకాగితములు ఆలేఖ అవియన్ని యు తనకు ముందుమార్గమునకు కడు వుపకారులని యెంచెను. వీనిఆధార మున తానిక గట్టిప్రయత్నముచేయ నిశ్చయించెను. అటులతలపోయుచు ఆలేఖ నొకపరి వెలుపలకుదీసిజూడ అందు 'వనవిహార్' అని యుండెను. 'వనవిహార్' ఎక్కడిది ? ఎన్నడు వినియుండలేదు. అంతపటముదీసిజూడ కలకత్తాకు పాట్నాకుపోవుమార్గమున వున్నటుల తెలుసుకొనెను. ఇట్టిహేం తకులకు అనువగుప్రదేశము. ఎటులయిన 'వనవిహార్' జేరవలయును. తప్పక శాంత అచ్చోటనే బందీకృత గావింపబడియుండును. అంతలో మెయిల్ కలకత్తాజేరెను. రమేశబాబు తొందరగ ఫార్క్సువీధినందలి తన గృహముజేరి కారును సిద్ధపరుప డ్రైవరునకుజెప్పి తనగదిజేరెను.

రమేశుడొకపరి తనవద్దనున్న ప్లానుతీసి పరీక్షించి మార్గము కను గొని తనకారు వేగముగనడుపసాగెను. రెండుగంటలసమయమున జన సమ్మర్దమేమియుండును ? రమేశునకెచ్చట మార్గమున మనుష్యసంచారమే గాన్పింపలేదు. మార్గమున కిరుప్రక్కల పొదలు, చెట్లు, చేమలతో నిండి యున్న వన్యప్రదేశము. ఇంతలో ఆతనిప్రయత్నమునకు శుభసూచకమో యన చంద్రుడు కారుమబ్బులనుండి బయటపడి తననిండుతేజస్సుతో

ప్రకాశించుచుండెను. రమేశుడటుల వడిగబోవుచుండ ఒకచో రెండు మార్గములుకలసెను. ఎటుబోవలెనో తెలియుటలేదు. అనూతనమార్గము రాజబాటనుండి చెల్లుబడుమగబోయెను. అందు కారు లటునిటుపోయిన చక్రములగుర్తులుతప్ప వేరొకగుర్తులులేవు. రమేశబాబునకు అనుమానము కల్గెను. [illegible] దృఢనిశ్చయుడై నూతనమార్గమున అవలంబించెను. మార్గమిసుమంతయు ప్రయాణమున కనువుగలేదు. అటులొక మైలువెళ్ళునరికి పోనుపోను పల్లపుప్రదేశమగుచుండెను. అది యొకలోయప్రదేశమని రమేశుడు గ్రహించెను. మరల తనప్రయాణము సాగింప దూరమున చెట్లమధ్యనుండి అగ్రుడ్డివెన్నెలయందు ఏదియో గృహమున్నట్లు ఆకృతికనబడెను. రాజబాటకు సుమారు యీగృహము మూడుమైళ్ళ [illegible] లోయప్రదేశమగుటచే అచ్చట అగృహమున్న టులే కన్పించదు. రమేశునకది ఎవరిదో తెలియదు. తనపిచ్చినమ్మకముతో ముందునకు సాగుచుండెను. రమేశునకును ఆగృహమునకును నూరుగజములదూరముండెను. గుబురులచాటునుండి ఒరులకంట బడకుండ రమేశుడాగృహపరిసరముల పరీక్షించుచుండెను. చూచుటంతోడనే యింతకు పూర్వము ఎవ్వరిచే వాడబడియుండలేదని గ్రహించెను. ఒకవేళ యీ హంతకుల నాయకుడే యిటనున్న తానంతకష్టపడనక్కరలేదు. శాంతను విడిపించుట, ఆనీచునకు తగినశాస్తి జేయుటజరుగును. అటుల తలంచుచు సమయమునకై జూచుచుండెను. అప్పుడప్పుడే తారకానాధుడు మరల మేఘావృతుండగుచుండుటగాంచి చీకటియగువరకు వేచియుండి మెల్లగ ముఖద్వారముజేరెను. బయట తాళముండుప్రదేశమునకై వెదకెనుగాని లేదు. ద్వారమునకు చిన్నరంధ్రముగలదు. అందుండి ముందున్నది పెద్ద హాలని తెలుసుకొనెను. తనచుట్టుప్రక్కల నెవరైన తనచర్యల కనిపెట్టుచుండిరేమోయని అన్నివైపుల కలయజూచి యెవరులేరని నిశ్చయుడై తనవద్దనున్న తాళపుచెవులతో ప్రయత్నింప తుదకు అదృష్టవశమున

బీగమువిడివచ్చెను. అంత ఆతాళము తనచెవినిబట్టి అది 4309 నెంబరు గల 'కిశోర్ చంద్ భూపతిలాల్' అనుకంపెనీ వారిదని గ్రహించి మెల్లగ తలుపులదీసి హాలునందుప్రవేశించి వెనుకనే తలుపులబంధించెను. ఏదైన శబ్దము విననగునని కొంతసేపు వేచియుండెను. కాని యెట్టిధ్వనిలేదు. గృహామునందంతట నిశ్శబ్దమునకు రమేశున కాశ్చర్యముకల్గెను. రహీమ్ నాయకునిగృహామా లేక తానూరక యీపాడువడియున్న గృహాము జొచ్చి కాలయాపనగావించుచుంటినా యని తత్తరపడసాగెను. ఒకవేళ తన్నుబంధింప వీరలెట్లైన దాగియుండిరాయని అనుమానించెను. ఏది ఎటులయిన తాను ప్రవేశించెను. ఇక యెట్టికష్టములకులోనైనను అందలి సంగతులు తెలుసుకొన నిశ్చయించి గృహామంతయు పరీక్షింపు తలంపుతో తనటార్చి వెలిగించెను. దానివెలుతురున తనకు సమీపమున దగ్గరగవేయబడిన ద్వారముగాంచెను. జాగ్రతతో ద్వారముజేరి మెల్లగ గది ప్రవేశించెను. గదినొకపరి పరీక్షింప మరలటార్చి నుపయోగించెను. అందు మధ్యగ నాలుగైదుకుర్చీలు మధ్యగ నొకగుండ్రటిబల్ల యుండుటగాంచెను. బల్లపై కాల్చిపడవేయబడిన రెండు సిగరెట్లు వుండెను. వాటిని జూచుసరికి యింతదనుక అందెవరు నివసింపలేదను రమేశుని యాలోచనలు మటు మాయమయ్యెను. బహుశ అవి రెండు మూడు రోజులక్రిందట కాల్చబడి యుండునని నిశ్చయించెను. అటుల ఆలోచించుచు టార్చిని వేరొకప్రక్కకు ప్రసరింపజేయ ఏదియోదీపపు కాంతివంటి వెలుతురు కనబడదొడంగెను. టార్చినార్పి బల్లపైనుంచి వెలుతురు కాన్పించు వైపుకు నడచెను. సమీపించిజూడ అంతయు ఆరిపోయి కొలదిగ మండుచున్న శీతలదేశీయు లింటనుండెడి పొయ్యి వంటి సాధనము. దానితో చలి దీర్చుకొందురు. అంత రమేశుడాయింట జనులున్నారని తలంచెను. ఎటనుండియో మాటలు వినవచ్చెను. అంతలో బయట అడుగులసవ్వడి విన నయ్యెను. వెంటనే ప్రక్కనదాగి

రమేశుడు తన టార్చికై ప్రయత్నింపబోవు నంతలో తటాలున గది తలుపులు తెరువబడుటయు అందుండి రమేశుని కన్నులు మూతలువడ వేరొకటార్చి ముఖముపై మెఱసెను. అంత తనయెదుటనుండి 'నిలువుము అడుగు కదల్చిన ప్రాణములు వీడెదవు. నీజిత్తుల చాలించుమ'ని రోష పూరితమైన వాక్కులు వినవచ్చెను.

రమేశబాబు నివ్వెరపడెను. కారణము తలవనితలంపుగ ఎట్టెదుట చేత పిస్టలుధరించి తన్ను ఆజ్ఞాపించు నూతనవ్యక్తియే. కంఠధ్వనిబట్టి ఆ వ్యక్తి స్త్రీమూర్తియని గ్రహించెను. ఒక స్త్రీమూర్తికి తానటులు వశుడగుట తలంచి రమేశుడు ఖిన్నుడయ్యెను. మరుక్షణముననే ఆవ్యక్తి టార్చి అటునిటు రమేశబాబుపై ప్రసరింపజేయుటలో ఆమెచేతనున్న పిస్టలు గుర్తించెను. తనకెదురుగ ప్రయోగింపబడ సిద్ధముగనుండెను. ఆమె ఆకారమునుబట్టి ఎట్టిపనికైనను వెనుదీయదని చెప్పవచ్చును. ఆమె తప్పక కాల్చివేయునని యెఱుగును. ఏమిచేయగలడు. ఇంతలో "ఢాం" అను విరుద్ధమగు శబ్దమగుటయు రమేశుడొకవైపుకు తప్పించుకొనుటయు ఒకతృటిలో జరిగెను. కాని పాపమారవ్వ రమేశబాబు తలనుండి దూసుకొనిపోయి కొలదిగ గాయపరచెను. మరల రెండవమారు పేల్చునని రమేశుడు తలచెను. తన జీవితముపై ఆశలేదని యెఱుగును. కాని అటుల జరుగుటకుమారు వేరొకధ్వని దానివెనువెంటనే హా! అనుచు ఆ స్త్రీమూర్తి నేలకొరుగుటయు చేతపిస్టలు క్రిందబడినశబ్దము విననయ్యెను. రమేశునకిదియంతయు విచిత్రముగ దోచెను.

రమేశుడటుల ప్రయత్నించునంతలో వేరొకహస్తము రివాల్వరు నందుకొన సమీపించెను. రెండుచేతులు నొక్కపరి సమీపించెను. కాని రమేశుడే నేర్పున ముందుగ రివాల్వరు వెలుపలికిదీసి నూతనవ్యక్తిపై గురి జూపెను. రమేశుడంత గంభీరస్వభావుడై "నీవెవరయిననుసరే! కదలితివా జాగ్రత్త" యని కఠినముగ పల్కెను.

"రమేశబాబూ! చంపవలద"నెడి మాటలు వినబడెను. రమేశు డా గొంతుక ధ్వని విని వెంటనే తన టార్చికై ప్రయత్నించెను. ఆ నిశీథ మున, నూతనప్రదేశమున తన పేరు పిలుచువా రెవరా యని విభ్రమ జెందెను. శాంత నదివరకు చూచెనే గాని ఆమె మూల్గాడుచుండ విని యుండలేదు. రమేశున కేమియు తోచలేదు. వెంటనే తన టార్చి ఆ వ్యక్తిపై ప్రకాశింపజేయ ఆ వెలుతురున రమేశు డామెను గుర్తించి "శాంతా! నీవా? యిచ్చటనే యుంటివా" యని ఆశ్చర్యమున పల్కెను.

"రమేశబాబూ! అవును. ఇక్కడనే బంధింపబడితిని."

"శాంతా! ఎటుల బంధింపబడితివి. కారణమేమి?"

"రమేశబాబూ! యిప్పుడు చెప్ప వేళలేదు. ఆలసించిన మన ప్రాణములు దక్కవు."

"ఈ స్త్రీ ఎవరు! ఆమె నన్ను చంప ప్రయత్నించినది. కాని అంతలోనే నేల కొరిగినది. ఏమి జరిగినో నా కింతవరకా విషయమై కడు ఆశ్చర్యముగ నున్నద"ని పల్కుచు రమేశు డటు తిరిగి ఆమె ప్రక్కనే పడియున్న అట్టను తీసి జూచి "క్లోరోఫారమ్" అని బిగ్గరగ పల్కి శాంతవైపు తిరిగి జవాబునకై వేచియున్నట్లు సూచించెను. అంత శాంత జరిగిన సంగతి వివరించెను.

"అటులయిన నీ వామెను స్మృతిహీనను గావించితివిగా! నా నేత్రము లా వెలుతురును జూడలేకపోయినవి. ఆమె రెండవమారు ప్రేల్చ నుంకించునంతలో నీ వామె వెనుక జేరియుండవలెను. నీవు రానిచో తప్పక ఆమె నన్ను నిర్దయురాలై కాల్చియుండెడిది. సమయమునకు రక్షించితివి. నీ ఋణ మెటుల తీర్తును. లెమ్ము. త్వరగ మన మిటనుండి పోవలయు" ననెను.

"రమేశబాబూ! ఆనాడు మీా గృహమున మీాతో సంభాషించి వెడలివచ్చుచు నొక రిక్షాపై పోవ నిశ్చయించి నొక రిక్షా పిలచితిని.

రిక్షా ఎక్కితినో లేదో కొలది దూర మేగునప్పటికి ఎవరో రిక్షాయందు ఎక్కియు నాపై కలియబడి ఏదియో వాసన జూపెను. ఇక మరి నాకు తెలివితప్పినది. మరల యిచ్చట పాన్పుపై పరుండియుండ తెలివి నొంది జూడ యీమెచే వుపచారములు బొందుచుంటిని. వేకువజామున యీమె యిట తిరుగుచుండు పదముల సవ్వడి వింటిని. అటు లామె ఎన్నడట్టివేళ తిరుగనందున కారణ మేమని ఆమెను వెంబడించితిని. ఆమె నన్ను గుర్తింపకుండ వెన్నంటి యిట మీకు ఆమెకు జరుగు సంవాదము వినుచుంటిని. అంత పహరావానిని మూర్ఛపడజేసిన "క్లోరోఫారమ్" పూయబడిన అట్ట యీకను చేత నుండుట గాంచి అదియే ఆసమయమున ఆయుధముగ నుపయోగించ వెనుకనుండి ఆమె ముఖము ముంగట బెట్ట అంత నొకపరి ఆమె ఊపిరి పీల్చి వెంటనే నేల కొరిగెను. అంతలో రమేశుడు "ప్రమాద మేమియు లేదు. త్వరలోనే ఆమె తెలివినొందు" నని ఆమెను పరీక్షించి పల్కెను.

"నిజమే! ఆమె నాపై అవసరమువచ్చినపుడు వుపయోగింప నిశ్చయించెను. కాని అజాగ్రత్తగ వదలిపెట్టెను"

"ఎంతసాహసికురాలు! అవునుగాని శాంతా ఆమె ఎవరో పేరేమియో యింతవరకు చెప్పక నా మనస్సున కారాటము హెచ్చుగావించుచుంటివి"

"ఆమె పేరు గులామ్! మూర్ఖుడగు నాయకునికంటె మంచిదని చెప్పవచ్చు".

"అయిన ఆమె రహీమ్ భార్య. అవునా శాంతా?"

శాంత రమేశుని మేధాసంపత్తికి అచ్చెరువొంది "రమేశబాబూ! అది మీకెటుల తెలియును. రహీమునుగూర్చి మీ రెరుంగరని తలంచితిని".

"నాకంతయు తెలుసును. ఆతడుకూడ అందెవేసిన చేయే. కాని అతడు స్వగృహము జేరుటకు కొలదికాలము పట్టును".

“ అటులనటలో అర్థమేమి ? గులామ్ ఆశ్చర్యమూర్చి కడు వెరగు జెందినది. ఆతడు వెడలి మూడుదినము లయినను యింతవరకు ఏవిధ మైనవార్త లేదు. అయిన రహీమ్ ఎటునుండెనో ఎఱుగుదువా ? ”

“ యిప్పుడు నన్నిచ్చటకు తీసుకుపోయెదరు ”.

“ అది గులామ్‌పై ఆధారపడియున్నది. ఆమె యెచ్చటకుపోవునో ఆప్రదేశమునకు___

‘గులామ్ యెచ్చటికైన వెళ్ళునా ?’

‘తప్పక వెళ్ళును. లేచిజూడ మనముపారిపోయితిమని తెలుసుకొను ను. ఆమెతప్పక తనమిత్రులుండు తావుజేరబోవును. మనపలాయనము సంగతి తెలుపబోవును. మనమామెను వెంబడించవలెను. శాంతా ! తెలిసినదా !’

‘కాని ఆమెనెటుల వెంబడించగలము’

‘ఎటులనా ? మనమిచ్చట ఆమెబయలు [illegible] త్వరలోనే ఆమె తనగమ్యస్థానముజేర బయలుదేరును. వెనువెంటనే ఆమెకు తెలియకుండ అనుసరింపనగునని పలుక వారిరువురు గులామ్ పడి యున్న గదికెదురుగనున్నగదిలో చీకటితోనున్న మరుగుప్రదేశమున దాగిరి.

కొలదిసేపటికే గులామ్ స్పృహజెంది తనకుజరిగిన సంగతియెల్ల స్ఫురణకుదెచ్చుకొనెను. డిటెక్టివు రమేశునిమాట జ్ఞప్తికిరాగ భయమధిక మవజొచ్చెను. తప్పక ఆతడు శాంతను వెంటదీసుకబోవుననియు, శాంత అటుల రక్షకభటశాఖాధికారుల పాలబడుట తమకెంతయు హానికరమని విచారించెను. తననాయకుడుపెట్టినబాధలకు కోపమున శాంత తమరహ స్యములనెల్ల చెప్పునని భయపడెను. అటుల ఆందోళితచిత్తయై గులామ్ లేచి శాంతయుండుగదిజేర అందు శాంతలేదు. ద్వారముచెంత పహారా వాడుపడియున్నాడు. ఆమెకు శాంతదుస్తులుగూడ కన్పించలేదు. ఇంతలో గృహసమీపమున కారునచ్చెడిధ్వని వినవవగా ‘అరుగో ! పోలీసులు

పోలీసు'లనుచు భయవిహ్వలయై కేకలిడుచు గవాక్షముజెంతజేరిచూడ తమమిత్రవర్గములోనివాడగు అజీజ్ కారునుండి దిగుటగాంచి మనస్సు కుదుటపర్చుకొని త్వరగ వారలకు గృహద్వారము తెరచెను.

'అజీజ్! అజీజ్! రమ్ము! త్వరగరమ్ము.'

అజీజ్ ఆమెముఖలక్షణములుబట్టి అనుమానాస్పదుడై 'గులామ్! ఏమిసంభవించినది' అని ఆతురతతో ప్రశ్నించెను.

'ఏమున్నది? అజిత్తులమారి రమేశుడిటకు వచ్చినాడు.'

'ఎక్కడ. చెప్పుము. వాని నీక్షణముననే' అని రివాల్వరు వెలుపలికి దీసెను.

'యింకను ఎక్కడ. శాంతారమేశు లిరువురు యిటనుండి పలాయితులైరి. మన నాయకుని చేతులలో మన ప్రాణములు దక్కవు. కానిమ్ము. ఎటులజరుగునో! మరల వారు పోలీసుదళముతో వచ్చి ముట్టడించులోపల మనమిచ్చటనుండి పోవలయును.'

'ఎచ్చటకు పోవుదము.'

'మరెక్కడకు? కంబరుకోటకు.'

'అటులయిన త్వరపడుము' అని వారిరువురు బయటనున్న కారుపై వెడలిరి.

ఇది యంతయు తన రహస్యస్థలమునుండి వినిన రమేశుడు శాంతనుజేరి 'శాంతా! అజీజ్, గులామ్ లిరువురు 'కంబరుకోట'కు వెడలిరి. ఆతడు రహీమ్ సంగతి తెలుసుకొనవచ్చెను. రమ్ము. వారల వెంబడింతము' అని పల్కెను.

## ప దు కొం డ వ ప్ర క ర ణ ము.

---

### రహస్యమందిరము — అమీర్ ఖాన్.

ఖాక్ బృందములో అజీజ్ ముఖ్యుడుకాడు. మిగిలినవారిలో రహీమ్ తరువాత యీతడే సమర్థుడు. రహీమ్ వార్తలేమి యు తెలియ

రానందున ఆతని స్థానమున అజీజ్‌ను నియమించెను. అజీజ్ సమయానుకూలముగ మెలకువగల్గి ప్రవర్తించును. రహీమ్ తరువాత ఖాన్ కితడే నమ్మినబంటు.

రమేశుడంత కారునాపి దిగుచు 'అదిగో భవనమునందు ఆప్రక్క వేరొక ద్వారమున్నదే! అయిన వారలు ప్రవేశించినది వెనుక భాగమునందలి ద్వారము 'మనముకూడ నందుండియే ప్రవేశింతమా?'

'వలదు! అది చాల అపాయకరము! రమేశబాబూ!'

'అట నెవరైన యుందురనియా నీభయము శాంతా! నాకివి యన్నియు అలవాటే! ప్రతిదినము యిట్టి సంఘటనలకు సంసిద్ధుడగ నుండవలసినదే!'

'అటులయిన నేనా వెనుదీయునది! వారలు ముగ్గురు. మన మిద్దరము. ఎటులయిన సరియే! రమేశ్‌జీ నడువుడు.'

'శాంతా! యీపనికి నీవుగూడ తలపడవలయునా! వలదు. నీవిటనుండుము. నిన్నుజూచినచో మరుక్షణమే కాల్చివేయుదురు. వచ్చిన కార్యమంతయు భంగమగును. నీవిటనుండియే వేచియుండి నేనొక గంటలో మరలి రానిచో నీకర్తవ్యమునకు గడంగుము.

అంత కొంతమంది రరహస్యమంతయు రమేశునకు విశదపర్చెను.

"శాంతా! నీవు గుర్తింపబడినచో కార్యమువమ్మగుటయేగాక కష్టములకు గురియగుదుము. నేపోయివచ్చెద ఒకగంటలోరానిచో నీపని నెరవేర్చుకొనుము. మెలకువతో సంచరించవలయును. జాగ్రత్త" యని హెచ్చరించి అజీజ్‌గులామ్‌లు ప్రవేశించిన ద్వారమునుండి రమేశబాబు లోనికి ప్రవేశించెను.

ప్రాతఃకాలము సమీపింపనున్నను యింకను చీకటిగనున్నది. చీకటితోడుగ పరిసరమందలి వృక్షసముదాయము ఆకాశమునంతను కప్పివుచ్చ మార్గమేమియు కాననగుటలేదు. దైవముకూడరమేశుని కను

కూలి చెనోయన పరిసరమంతయు దట్టమగు పొగమంచుచే నిండి యుండెను. తనరాక పసికట్టు మండిరేమోయని నలుప్రక్కల కలయజూచి ఎవ్వరు లేకుండుటగాంచి సంతృప్తి మనస్కుడై భవనముజొచ్చెను.

గృహమంతయు అంధకారబంధురము. కొలదినిమిషము లాచీకటికి తనకన్నుల నలవాటుజేసుకొని తానున్నదొక చిన్నహాలనిగుర్తించెను. అటనుండి చేతరివాల్వరుధరించి ముందుకుసాగెను. బహుశః వారలు పైభాగమునందుందురని ఆ అంధకారమున పైకిబోవుమెట్లు కనుగొని ఎట్టకేలకు మెల్లగ రమేశబాబు పైభాగముజేరి నలుప్రక్కల నొకపరి తన దృష్టుల పోనిచ్చెను. అతిజాగరూకతతో ఏదైన శబ్దము వినవచ్చునేమో యని కొలదిసేపు నిరీక్షించెను. కాని రమేశుని తలంపువ్యర్థమయ్యెను. ఆగదియందు పనిముట్లుతప్ప వేరొండేమియులేవని తెలుసుకొనెను. పిల్లి వలె అడుగులిడుచు ప్రతిద్వారముకడ ఏదోసంభవింపనున్నదను ఆతురతతో ఆగజొచ్చెను. కాని యెంతకు సవ్వడిలేదు. పరిపరివిధముల ఆతని మానసము తత్తరపడజొచ్చెను.

కొలదిదూరమునుండి దీపపువెలుతురు కన్పింపదొడగెను. రహస్యప్రదేశ మదియేయని గ్రహించి రమేశుడు మెల్లన రెండుమూడు గజములావైపు నడచెను. ఇంత కొలదిగ మాటలసవ్వడి వినవయ్యెను. కంఠధ్వనులబట్టి అందు అజీజ్ గులామ్‌లిరువురుకాక వేరొక నూతనవ్యక్తి గూడ నుండెనని తెలుసుకొనెను. ఆనూతనవ్యక్తి యెవరో రమేశునకు దెలియలేదు. సంభాషణవిను తలంపున ద్వారము జేరుసరికి లోనుండి గ్లాసులు పగిలిన చప్పుడు బుస్సుమనుచు సీసాకార్కుదీసిన ధ్వని వినబడెను. రమేశుడది విని వారలు తప్ప త్రాగుచు మైమరచి ఆనందమున మునింగియుండిరని గ్రహించి యింకను త్రాగవలసినదే యని తనలో తానను కొనెను. కాని రమేశుని ఆశలన్నియు నిరాశలయ్యెను.

అటుల సుమారొక గంటకాలము గడచినది. రమేశుడు వారల సంభాషణనుబట్టి వారల నాయకుని రాకకై యెదురు చూచుచున్నా రని గ్రహించెను.

ఇంతలో కఠినముగ పల్కుచు ప్రశ్నించెడి నూతనకంఠధ్వని వినెను. తానటనుండగనే వేరొకనూతనవ్యక్తి అటకుజేరుటజూడ బహుశ నాయకునివద్దనుండివచ్చిన వార్తాహరుడని తలంచెను. అతడేమిచెప్పెనో లేక బయట యెవరైన తమందరను కనిపెట్టుచుండిరనికాని తమరహస్య సంభాషణ వినుచుండిరనిగాని పసికట్టిరో లేక అనుమానించిరో ఆమరు క్షణముననే రమేశున కిరుప్రక్కలనుండి మనుజులపదసవ్వడి వినవచ్చెను. ఆధ్వని తనవైపునకే సమీపించుటగాంచి తప్పక వారు తనరాక తెలుసు కొని యుందురని రమేశుడు గ్రహించెను. ఇరుప్రక్కలనుండి చుట్టుముట్టు చున్నారే! ఏమిచేయునది? కృతనిశ్చయు డగునంతలో రమేశుని కుడి యెడమవైపులనుండి కాంతివంతమగు చేతిలైటులు రమేశునిపై ప్రకా శింపజేయబడెను. ఆకస్మికముగ యింతలో నాయకు డరుదెంచుననిపల్కు టయు వెంటనే అజీజ్ రమేశునిపై కురుకుటయు జరిగెను.

రమేశుడంత ఆపాతకుడరుదెంచునంతలో నడికట్టుబిగించి సిద్ధముగ నుండెను. అటుల రమేశునిపై బడినఅజీజ్ బలముగ పోరాడమొదలిడెను. యిరువురకు గాయములుదగుల అందునుండి రుధిరముస్రవించుచుండెను. పోరున రమేశుడు అజీజ్ మెడబట్టి నేర్పున క్రిందపడగొట్టి చేతనున్న పిస్టలులాగ ప్రయత్నించెను. అటులపెనుగులాటలో అజీజ్ప్రేల్చిన గుం డ్లువ్యర్థమగుటయేగాక అతనిపాదముగూడ గాయపడెను. వేరొకగుండు రమేశుని భుజమునతగుల గాయపడెను. ఆదృశ్యముగాంచి అసఫజామి త్రుని సహాయార్థము పోరాటమునకు తలపడునంతలో రమేశుడు అజీజ్ పిస్టలుతో అసఫజాను నిరాయుధునిజేయ చేతనున్న రివాల్వరు దూర మున బడెను. వెంటనే వేరొకమారు ప్రేల్చ కాళ్ళకు తగుల బాధతో

అచేతనుడై పడెను. అటుల అజీజ్, అసఫా లిరువురును ఒకరిపై నొకరు మెట్లపై దొర్లుచు, తనకు తగిలిన గాయము కట్టుకట్టుకొను రమేశుని, క్రోధమున అజీజ్ కాలుపట్టుకొని లాగ రమేశు డంత తూలుచు వార లపై బడెను. రమేశు డటుల మధ్యనున్న ఖాళీప్రదేశమునపడెను. రమే శుని శరీరమున కొంతభాగము మెట్లసందులో పడనుండెను. రమేశుడు మెట్లకు వేరొకప్రక్కనున్న అగాధములో పడనుండెను. రమేశుడు మెట్లకు వేరొకప్రక్కనున్న పంచను పట్టుకొనెను. రమేశునకు అజీజ్ అస ఫజులను చంప నిష్టములేదు. వారలు లేనిచో నిజసంగతి తెలియదని తలచి ఎటులయిన వారిని రక్షించి వారలనుండి రహస్యము వెల్లడిబరచ ప్రయత్నించెను. తన మడమ పట్టుకొని అజీజ్ను, అజీజ్ కాలుపట్టుకొని అసఫజాయును అటుల గాలిలో నిరాధారులై వ్రేలాడు చుండిరి. రమే శుడు పట్టువదలెనా ముప్పురకు బ్రతుకుపై ఆశలేదు. తన బలమునంత నుపయోగించి పైకి వచ్చునట్లు శరీరము నూపమనెను. లేనిచో వారలకు వేరు దాగిలేదని పల్కెను.రమేశుడు చెప్పిన చొప్పున అజీజ్, అసఫాలు ఊపిరి బిగబట్టి సిద్ధముగనుండిరి. అంత రమేశుడు అజీజ్ను తన ఎడమ ప్రక్కకు త్రిప్పి మెట్లపైకి వచ్చునట్లు చేయదలచెను.

గదియంతయు చీకటి పాపము రమేశునిచేతినుండిపడిన టార్చినుండి మాత్రము కొలదివెలుతురు యిచ్చుచుండెను. వారటుల ఊగుటలో ఒక రినొకరుఢీకొన అసఫజాపట్టువదలి క్రిందభాగమునబడెను. నుదుటిపై బల మగుగాయము తగిలెను. స్మృతివిహీనుడై రొజుచు తనకు తగిలినను అజీజ్ సురక్షితము మెట్లపై జేరునని తలచెను. ఆతనికిగూడ అసఫజాగతి యేపట్టెను. కాని తలవనితలంపుగ రక్షింపబడెను. దీపపువెలుతురు కన్ప డెను. ఆవైపుహోనుద్యుక్తుడవునంతలో గందరగోళముతోకూడిన వ్యక్తుల సంభాషణలు, పదములధ్వని వినవచ్చెను. ఏమిటదియని ఆలోచించునం తలో తనవైపుకే పారందరు వచ్చుచుండుటజూచెను. ఆలోచనలకు

మయముకాదని కార్యమునకు గడంగవలయునని తలచి రానున్న సంఘటన యెటువోన్న నంసిద్ధుడగుచుండెను.

అటులానూతనవ్యక్తి కడునేర్పునపడిపోవు అజీజ్‌ను పట్టుకొని నేదదీర్చ అతడు కన్నులువిప్పిజూడ తననాయకుడు. అంత నతడదరిపడి భయమున వణకుచు నోటమాటరాక తడబడుచు 'హు...జా...ర్ మీా...రె...ట్లు......'అని ఒకపెద్ద వెర్రికేకవేసెను.

'అజీజ్ ! ఏమది ? ప్రలాపములుమానుము. జరిగినవిషయమేమి? ఇకజరుగవలసినదేమి ! త్వరగజెప్పుము.

అసఫజా పాపము అతనికి తగిలిన గాయమునుండి రుధిరము స్రవించ స్మృతివిహీనుడై పడియుండెను. యింకను తెలివొందలేదు.

'ఎవరు ? ఏమో ! డిటెక్టివ్ రమేశ్‌బాబూ !' అని తనచేతనున్న రివాల్వరు రమేశునిపై గురిజూచెను.

రమేశుడదిజూచి పోరాటమున తన రివాల్వరు పోగొట్టు కొన్నందులకు చింతిల్లెను. 'అవును. నేనే ! ఏమయిన నేమిలాభము. ప్రస్తుతము నీదయకు పాత్రుడనై యున్నాను. కాని......'

'కాని ? కాకపోయిన నీవు చేయునదేమి ? రమేశ్ ! టక్కరి యెత్తులు యికపనిచేయవు. చేజిక్కితివి. యింకెక్కడి కేగెదవు' అని గద్దించిపల్కెను.

" నీ యిష్టమువచ్చినట్లు చేయగలవు. నీవశుడను. దేనికైనను సమయము రావలెను. గర్వపడకుము ".

" నాయిష్టమువచ్చినటులా ? ఒకవిధముగగాదు. ఇది నా అదృష్టము నీవిట్లు సులభముగ చేజిక్కుట ! ఆహా నేడెంతసుదినము. రమేశ్ ! యిక నా కృత్యములేమి ? యిక ఎవ్వరివిషయములందు అనావశ్యకముగ ప్రవేశము కల్గించుకొనుటకు నీకిదియే కడపటిసారి. నీ చర్యల కీశిక్ష తగి యున్నదనుచు రివాల్వరుకు ప్రయత్నించెను.

అప్పుడే తెలివిగాంచిన అసఫజా " హుజూర్! వలదు. డిటెక్టివ్ రమేశబాబా ! ఎవరైననేమి ? నన్ను సులభముగ అంతమొందింప వీలగు

సమయమున ఆ కూపమున బడకుండ కాపాడిన మనుజుని యింత క్రూర ముగ చంపుట న్యాయమా !" అని బ్రతిమాలుచు పల్కెను.

"ఏమి ? చంపగూడదా ? నీవా నాకుబోధించునది తులువా!" యని వానినొక ప్రక్కకు బడునట్లుత్రోసి ఒకటి... రెండు... అనుచు అసఫజా లాగుటతో క్రిందబడిన రివాల్వరుకై ప్రయత్నింపబోయెను. కాని లాభము లేకపోయెను. సమయము మించినది. ఆ నూతనవ్యక్తి రివాల్వరు అందుకొనబోవునంతలో వేరొకటి అతనికి అయిదారడుగుల దూరమునుండి శిరమునకు గురిజూడబడుచుండుట గాంచెను. ఆ నూతన వ్యక్తి ఎవరు ?

ఆవ్యక్తి 'అమీర్‌ఖాన్ ! ప్రయత్నము మానుము. లేనిచో యిటులే ప్రేల్చెద' నని కోపఘూర్ణితధ్వని పల్కెను.

ఎదుర్కొనుటకైన బలములేక కడు నీరసస్థితియందుండి గాయ బాధచే సరియయిన తెలివిలేకయున్న రమేశుడు యిది గుర్తించలేదు. ఆవ్యక్తి ఏమనిపల్కినది. అమీర్‌ఖాన్ కదా ! ప్రసేనుబాబు హంతకుడా! యిట్టి ఆపత్సమయమున అరుదెంచిన ఆనూతనవ్యక్తి ఎవరు ? ఆకారమును బట్టి ఆచీకటిలో పురుషుడని తెలుసుకొనెను. రహస్యమంతయు బయట పడినది. అమీర్‌ఖాన్ ! ఎంతటి సాహసుడు. యీతడే వీరందరికి నాయకుడై యుండెను. రమేశుడు వెంటనే ఆతనిపై బడి చేతులకు సంకెళ్లు తగిలించవలెనని తొందరపడెను. కాని బలహీనతచే కదలలేకపోయెను. రమేశుడెంత ఆలోచించినను ఆనూతనవ్యక్తి ఎవరో తెలియుటలేదు. ఆకారముజూడ పురుషుడు. కంఠధ్వని తన కిదివరకు పరిచితమైనదే ! పురుషకంఠధ్వనికాదని రమేశునకు అనుమానము కల్గెను. శాంత కాదు గదా ! ఏమో తొందరయేల !

ఆ నూతనవ్యక్తి రివాల్వరు అటులే ఖాన్‌వైపు గురిజూచుచు వేరొకచేతితో టార్చి రమేశునిపై ప్రకాశింపజేయ ఆవెలుతురున రమేశు డేమి గుర్తించెనో ఆవ్యక్తిచేసిన సంజ్ఞచే ప్రతిగ రమేశబాబు నోటినుండి

అప్రయత్నముగ 'శాంతా! నీవా! ఎట్లువొచ్చితి' వను పలుకులు వెలువడెను.

మరుక్షణమే ఆమెచేతనున్న రివాల్వరు అలక్ష్యముజేసి త్వరితగతి ఆమెపై కిబోయిరి. వెంటనే శాంత నొకసారి తన ఆయుధమునకు పనిచెప్ప 'ఢాం! ఢాం!' అను శబ్దము ముమ్మారు భవనమంతయు మారు మ్రోగుటయు అజీజ్ 'అయ్యో!' అనుచు నేలకొరుగుటయు జరిగెను. అజీజ్ పడుటగాంచి అసఫ్, గులామ్ లొకవైపు ఖాన్ ఒకవైపు మీదికిరాగ అప్పుడే కొంతవడి సేదదీరిన రమేశబాబు వెంటనే తన రివాల్వరు ప్రయోగించెను. శాంతారమేశుల రివాల్వర్లనుండి 'ఢాం! ఢాం' అను గుండ్లశబ్దములతో భవనమంతయు అల్లకల్లోలముగ నుండెను. పోరాటమున అసఫ్, గులామ్ లిరువురు గాయపడి మూల్గుచు క్రింద బడిరి. పాపము రమేశుని పాతగాయమింకను మానలేదు. మరల వేరొకటి నుదుటిపై తగిలెను. శాంతప్రయత్నములు లాభములేకపోయెను. ఎను బోతువలె ఖాన్ 'శాంతా! ఆరివాల్వరు పారవేయుము. ప్రమాదమున అది ప్రేలును. నాకు దెబ్బతగులును. నే గాయపడుట నీకిష్టమా? చెప్పు' మనుచు మోహాంధుడై ఆమెపై లంఘించి నొక తృటిలో ఆమెను నిరాయుధనుజేసి తన ఆజానుబాహువులచే శాంతను కౌగలింప బోయెను.

ఖాన్ బారినుండి తప్పించుకొన శాంత సన్నని యిరుకైన చీకటి మార్గమువెంబడి పరువెత్తసాగెను. అమీర్‌ఖాన్ వెనువెంటనే వెంబడించెను. ముందు శాంత వెనుక ఖాన్ పరుగిడుచు కొలదిదూరముననున్న తలుపులు జేరగిలవేయబడిన నొకగదిముంగటకువచ్చుసరికి ఖాన్ ఆమెను పట్టుకొనెను.

'శాంతా! ఈక్షణముతో నీపనిసరి పాపి! వంచకురాలా! చచ్చితివా'యని రౌద్రాకారుడై లేడిపై లంఘించు వ్యాఘ్రమువలె శాంతపై కలియబడెను.

అటుల ఖాన్ శాంతను పట్టుకొని పెనుగులాడుచుండ తటాలున గదితలుపులు బ్రద్దలగుటయు అందుండి చావసిద్ధముగ నున్నాడా యను నట్టి యువకుడొకడు కడుసాహసమున ఖాన్‌పై లంఘించి నొక్కపెట్టున వానిని పిడికిటతోపొడిచి చేతనున్న యినుపతలుపు కమ్మితో ఖాన్ శిర ముపై కొట్ట తూలుచు నేలకొఱిగెను.

"తగినశాస్తి జరిగిన" దనుచు అన్నపానీయములేని ఆయువకుడు నీరసముతో ఖానుపై కొరిగెను.

కొంతసేపటికే మూర్ఛనుండి స్పృహజెందిన శాంత తనకు సమీపమున ఖాన్ వేరొక నూతనవ్యక్తి పడియుండుటగాంచి రమేశబాబును వెదక జయులుదేరెను.

అంతలో రమేశబాబు 'శాంతా! శాంతా!' యని పిలుచుచు అక్కడకుజేరి అచ్చటనే పడియున్న నూతనవ్యక్తినిగాంచి 'ఏమి? రవీందుడా? ' అని హాశ్చర్యమున వానిజేరి తనజేబునందలి పెట్టెదీసి అందలి సీసాదీసి నాసికారంధ్రములకడనిడ రవీంద్రుడు తెలివొంది తనయజమాని రమేశబాబుచే సపర్యబొందుచుండుటగాంచి 'రమేశ్ జీ! మీరా? ఇక్కడనేయుంటిరా?' అని ఆతురతతో పల్కెను.

'రవీంద్రా! ఏమి యీఆకారము.'

'రమేశ్ జీ అబ్బా! అన్నపానీయములులేక బలహీనముగ నుంటిని లేనిచో ఆతనిని......అయినను మీరివాల్వరొకపరి యిటుయిచ్చిన యిప్పుడే...'అని నీరసమున కన్నులుమూసెను.

అంతరమేశుడు శాంతనుద్దేశించి 'శాంతా! ఈతడే నాసహచరుడు రవీంద్రుడు.'

'రమేశబాబూ! సమయమునకు రక్షించినాడు. లేనిచో నేనా హంతకునిచేతిలో ప్రాణములుబాసియుందును. రవీంద్రబాబూ! నీకు నా ధన్యవాదములు.'

'శాంతా! ఎంతమాట! ఇంతకు నేచేసినదేమి?' అంతకు ఆ దయామయుడేకలడు.'

అటులశాంత రవీంద్రునకు సపర్యలుచేయుచుండ రమేశబాబు ఖానున కరదండములు తగిలించెను.

ఇంతలో అమీర్‌ఖాన్ తెలివిగాంచి రమేశ రవీంద్రులగాంచి 'ఆజీజ్, ఆసఫ్, రండు యిరుగో రమేశ్, రవీంద్రులు ఆలోచించకండు. శాంతకూడ యిచ్చటనే యున్నది. బంధింపుడు. త్వరగరండు' అని కేకలిడ మొదలిడెను. ఆతనిఆజ్ఞలను నిర్వర్తించువారేరి. అందరు అప్పుడే యాతనిరాకకై పరలోకమున వేచియున్నారని పాపము! అమీర్‌ఖాన్‌కు తెలియదు. తనచేతుల కరదండములుగాంచి కోపమున రమేశుని గాంచి 'రమేశ్! నన్ను నిర్బంధించుటకు నీకేమి అధికారముగలదు. ఏ తప్పిదముక్రింద బంధింతువు' అనిపల్కెను.

'నిన్ను బంధించుటకు నేరములుగూడ గావలయునా? లెక్కలేనన్నిగలవు. నన్ను చంప యత్నించుటయే నేరము. ఇక చాలునా? శాంతా! 'యిదిగో' యని జేబునుండి పోలీసు విజిల్‌దీసి వెలుపలికిబోయి యిది ఊదుము. రక్షకభటు లరుదెంతురు. వారలవెంటగొనిరమ్మని చెప్పిపంపెను.

కొలదిసేపటిలో శాంత నలుగురు రక్షకభటులు ఒకసార్జెంటుతో ప్రవేశించెను.

అంత సార్జెంటు రెజినాల్డు రమేశబాబునుగాంచి 'హల్లో! రమేశబాబు! గుడ్‌మార్నింగు!

'వెరీ గుడ్‌మార్నింగు! మిస్టర్ రెజినాల్డ్' రమేశబాబు కరస్పర్శలానంతరము రెజినాల్డునకు సంగతియెఱుకపరచి ఖానును కారాగారమున నుంచ వారల కప్పగించ సార్జెంటు రమేశబాబువద్ద సెలవుదీసికొని పోలీసుస్టేషన్‌కు బయలుదేరెను.

వారువెడలినవెంటనే రమేశునకు గులామ్ జ్ఞప్తికిరాగా ఆమెకై వెదకెను. ఎక్కడలేనందున పోరాటముమధ్య అటులదెబ్బతిని పారిపోయి యుండుమనని తలచెను.

రమేశుడంత శాంతవై పుదిరిగి——

'శాంతా ! సమయమునకు నన్ను రక్షించితివి. నీవురాకున్న ఖాన్ దారిద్రివాల్వరుకు గురియయి పరలోకము జేరి యుండెడివాడను. నీ ఋణ మెట్లు లతీర్తును.

'ఇంతకు నేనేమిచేసితిని. ఏదో సమయమునకు నన్నా భగవంతుడే పంపినాడు. మిమ్ము నన్నును రక్షించినదీ రవీంద్రబాబు !'

రమేశబాబూ ! నేను రక్షించునదేమి ? వనవిహార్ జేరుటతోడనే కారుదిగి ఎవ్వరుచూడకుండ లోనికి ప్రవేశించితిని. ప్రవేశించగనే వారది గనిపెట్టి నన్నొకగదియందు బంధించిరి. ఆగదితలుపు రోజు బంధింపబడెడిది. ఏలనో ప్రతిదినము ద్వారము బంధించు పహరావాడు యీనాడు మరచెను. లేనిచో శాంతనటుల రక్షింపగలెడివాడనుగాను.' అని తనకద చెప్పెను.

'రవీంద్రా ! వారలందరు తప్పత్రాగి ఒడలుమరచి ఆనందమున యుండిరి. కవాటము బంధింపబడకుండుటకు కారణ మదియే!'

'రమేశ్ జీ ! యిన్ని దినములనుండి మీవార్త తెలియకపోవుటయు ఆతంతివార్త వచ్చుటయు యిన్నికష్టములకు లోనవజేసినవి.'

'కార్య భారముచే నీమాటయే మరచితిని ! వేరేమియులేదు.'

'రహీమ్ ఆరోగ్యవంతుడైనాడా ?'

'కొలదిగ ఆరోగ్యముపొందినాడు. యింకను నడువ శక్తిచాలదు'

రమేశ రవీంద్రులకేమి సంభవించెనో యనియు, రహీమ్ సందర్భమున తనకేమి ముప్పు వాటిల్లునో యని ప్రాణము లరచేత నిడికొని నిరీక్షించుచున్న యజమాని వీరల రాకచే విచారముపీడెను.

'భూపతిరాయ్ ! ఎటులున్నాడు రహీమ్?'

'రమేశబాబూ ! సురక్షితముగా నున్నాడు. బాగుగా మాట్లాడ గల్గుచున్నాడు.'

'ఏమటులుంటిరి ?'

‘ఏమున్నది. యీగొడవలో నాపై ఏమివచ్చునోయని నాప్రాణములు రవీంద్రబాబు వెడలినప్పటినుండి కొట్టుకొనుచున్నవి. దానికి తోడు యీహంతకబృందములోని రహీమ్ ఒకడు’

‘ఏమయిన పారిపోవుటకుగాని హానిచేయుటకుగాని ప్రయత్నించెనా ?’

‘లేదు. లేవలేడుగా ! లేనిచో నన్ను వంచించి పలాయితుడయ్యెడివాడేమో ! మీమనిషిని మీకు వప్పగించితిని. యికనాబాధ్యత దీరిన’ దనుచు తనభయము వెల్లడించెను.

అంత శాంతరాయ్‌గారు ! మంచిధైర్యవంతులే ! అనగా అందరు పక్కుననవ్విరి.

మరునాడు 10 గంటలయ్యెను. రవీంద్రశాంతారమేశులు తమ భోజనాదుల ముగించిరి.

రమేశబాబు తనడైరీ రికార్డుచేతగొని వేళసమీపించెనని కారుపై రహీమ్‌ను దీసుకొని న్యాయస్థానమునకు పయనమయ్యెను.

---

## ఉ ప సం హా ర ము.

అప్పుడే 11 గంటలయ్యెను. కలకత్తా హైకోర్టునందంతయు చాల హడావిడిగనుండెను. హంతకుడు, చోరశిఖామణియగు అమీర్‌ఖాన్ పట్టుపడి, విచారింపబడునని తెలసి జనసమూహములు తండోపతండములుగా విచారణ వినకుతూహాలురై అరుదెంచిరి. న్యాయాధికారి అప్పుడేవచ్చి తన స్థానమునలంకరించెను. కోర్టుహాలంతయు నిశ్శబ్దముగ నుండెను. ఇంతలో బయట కారుఆగినశబ్దమువ సార్జెంటు రెజినాల్డుయిన స్పెక్టరు కిర్పున్న రమేశబాబునాహ్వానింప ఎదురేగి తోడ్కొనివచ్చిరి.

కేసువిచారణ ప్రారంభమయ్యెను. అమీర్‌ఖాన్ రహీమ్ వచ్చుట జూచుటతోడనే హతాశుడయ్యెను. తనవలననే ఆతడుగూడ శిక్షకు గురియైనను కోపమున నిజసంగతియంతయు బయటబెట్టునని భయపడెను. రమేశబాబు రికార్డువల్లను, రహీమ్‌సాక్ష్యమువల్లను అమీర్‌ఖాన్‌పై

నేరము అధికమయ్యెను. ఖాన్ బలవంతముననే రహీమ్ యీయుద్యమ మున వ్యవహరించెననితలచి న్యాయాధికారి రహీమ్‌నకు మూడేండ్లు కఠినకారాగారవాసశిక్షయును, హంతకుడు స్త్రీలపాలిటి కంటకుడగు అమీర్‌ఖాన్‌నకు ఉరిశిక్షయు విధించెను.

పత్తేదారు రమేశబాబు ప్రవీణతకు, పట్టుదలకు, విద్యావినయసంపత్తికి, అపరాధపరిశోధనావిషయములగల నేర్పునకు ప్రభుత్వమువారు అందమగు నగిషీగల సువర్ణమయపాత్రను, రెండువేలరూప్యములను రవీంద్రునకు రజితపాత్రను, వేయిరూప్యములనిచ్చి గౌరవించిరి. పత్తేదారు రమేశబాబు తనపని ముగిసినవెంటనే న్యాయస్థానమునువీడి పార్కు వీధినందలి శాంతారవీంద్రులతో తనగృహముజేరెను.

ఉదయము 10 గంట లయ్యెను. హైకోర్టు ప్రధానన్యాయమూర్తి రక్షకభటశాఖయినస్పెక్టరు జనరల్, కలెక్టరు మొదలగు ఉన్నతోద్యోగు లందరువచ్చిరి. అందరిసమక్షమున శాంతా రమేశులకు అత్యంతవైభవ మున వివాహము ముగిసెను. వివాహసందర్భమున పలువురు రమేశబాబు నకు అనేకవిధములయిన బహుమతులు, కట్నములు చదివించిరి. వివాహా నంతరము గొప్ప విందు జరిగెను. విందానంతరము రమేశబాబువద్ద సెలవుగైకొని ఎవరితావులకు వారేగిరి. యెంతయో శోభాయమానముగ నుండెను.

వెనుకనుండి 'హేండ్స్‌అప్' అనుమాట వినబడ తటాలున లేచి జూడ రమేశబాబు అంత శాంత 'యిక్కడా మీ డిటెక్టివ్ తీవేనా? గొప్ప సరసులుకాదూ' అని చమత్కారంగా అంది.

'ఓహో! యీ పూలహారమేమిటి! చాల సొగసుగావుందే! దీని ధరించే మన్మధుడెవడో!'

'ఎవరన్నా వారే!' అనుచు శాంత రమేశుని మెడలో హారమువేసి తన్మయానందమున కన్నులుమూసింది. కన్నులు తెరచి చూచేటప్పటికి రమేశబాబు కౌగిటలోవుంది.

కోకిల కుహూ! యని నూతనవధూవరులకు మంగళంపాడింది.

స మా ప్తి